# మిత్రభేదం



కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి

తరువాత దమనకుడు సంజీవకుని జేరి దిగులుగా తలవంచె.




"ఏముంది సోదరా? బానిసల బ్రతుకన్న కత్తిపై సాము గదా!"




"మన రాజు పింగళకు- డీ నాడు నిను చంపి - నీ మాంసమును తిండి - విందు చేయగనెంచె!"



ఈ ఘోర వార్త విని - వృషభమ్ము మూర్ఛిల్లె! - దమనకుడు తోకతో - మెల్ల మెల్లన విసిరె.



"రాజు నను భక్షించ పొంచియున్నాడా? ఏ ఘోర నేరమున కీ ఘోర శిక్ష!"



అనుచు సంజీవకుడు కన్నీరు కాల్వలై కారగా విలపించె

"రాజునన పనియేమి? దోషమంతా నాది! దుష్టులతో స్నేహమ్ము దుఃఖ హేతువు కాదె!"



"నిజమెరుగక స్నేహమొనరించి ఒక హంస మరణించ లేదా!"




వెనుకటికొక అడవిలోన చక్కని ఒక చెరువు కలదు.



అందుండెడి దొక హంస. - దాని పేరు మహాశ్వేత. - ఆటలతో పాటలతో - హాయిగ జీవించేది.



ఇట్లెన్నో ఏళ్లు గడువ ఒకనాడొక గుడ్లగూబ హంస కడకు వచ్చినది.



"ఎవరు నీవు? ఏమి పని? ఎచటినుండి వచ్చినావు?"

"పద్మవన ప్రాంతంలో - నివసించెడి వాడ నేను - నీ సద్గుణ శీలములను - జనులెంతో కొనియాడగ - చూచిపోదమని వచ్చితి!"



"ఓహోహో, అట్లయితే - నీకిదె నా స్వాగతము - ఇచ్చవచ్చినంతవరకు - కొలనిగట్టు కొమ్మలలో - ఉండవోయి స్నేహితుడా!"



సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.




సంపుటము 44
సంచిక 50
**20-8-52**

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

నందన శ్రావణ బహుళ అమావాస్య బుధవారము

మైసూరువద్ద బృందావన గార్డెన్స్‌లో ఒకభాగం

ఛాయా-చిత్ర కౌశలము : సినీనటుడు శ్రీ ఎ. నాగేశ్వరరావు.

# పార్లమెంటు సమావేశం

పార్లమెంట్ బడ్జెట్ సమావేశం మూడు మాసాలు జరిగి గురువారంతో ముగిసింది. ప్రభుత్వ ఆయవ్యయాలు, రైల్వే ఆయవ్యయాలనే కాక ప్రభుత్వం ప్రవేశపెట్టిన 27 శాసనాలను కూడా పార్లమెంట్ ఆమోదించింది. వీనిలో ముఖ్యమైనవి ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం, నేర విచారణచట్ట సవరణ, అమ్మకపు పన్నులచట్టం. మంత్రులజీతాలు పార్లమెంట్ సభ్యుల భత్యాలు తగ్గించబడినాయి. మరణ సుంకాల బిల్లు ఈ సమావేశంలో ప్రవేశపెట్టబడింది. భాషారాష్ట్రాలను గురించిన అనధికార తీర్మానాన్ని చర్చించి ప్రజాప్రతినిధిసభ నిరాకరించింది. ఆంధ్రరాష్ట్రనిర్మాణం గురించి రాజ్యపరిషత్తు (కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్)లో శ్రీ పైడా వెంకట నారాయణగారు ప్రవేశపెట్టిన తీర్మానం నిరాకరించబడింది. స్థాయీసంఘాల పద్ధతికిస్వస్తి చెప్పబడింది. కాశ్మీర్‌తో భారతప్రభుత్వం చేసుకున్న ఒడంబడికను పార్లమెంట్ ఆమోదించింది, ఆహార వస్తువుల కంట్రోల్ రద్దును కూడా పార్లమెంట్ ఆమోదించింది.

## డిటెన్షన్ చట్టం

డిటెన్షన్‌చట్టంగురించిన చర్చ తీవ్రంగా జరిగింది. ఈ చట్టాన్ని ప్రతికూలవర్గాలవారందరూ తీవ్రంగా ప్రతిఘటించారు. కమ్యూనిస్టుల వైఖరిని రాజ్యపరిషత్తులో పుచ్చలపల్లి సుందరయ్యగారు స్పష్టపరిచారు. ప్రజలు ప్రశాంతజీవనం గడపలేకపోతున్నారంటే ఇందుకు కారకులు ధనికవర్గాలవారూ ధనికవర్గాలకు చెందిన ప్రభుత్వమూనని వారు చెప్పారు. ఆంధ్రదేశంలోనూ, మలబార్‌లోనూ హింసాకాండను ప్రేరేపించినవారు ప్రభుత్వోద్యోగులన్నారు. ఆంధ్రదేశంలో ఘాతుకచర్యలకు దిగినట్లు పోలీసువారిపై నిందమోపారు. తెలంగాణాలో ప్రభుత్వమే నిరాయుధులైన ప్రజలపైన యుద్ధం ప్రకటించినట్లు ప్రవర్తించిందన్నారు.

తొమ్మిదిమాసాలుగా తమవద్ద ఆయుధాల్ని ప్రభుత్వాని కొప్పగించడానికి ప్రయత్నిస్తుంటే హైదరాబాద్ ముఖ్యమంత్రి రాజీకి ఒడబడ్డంలేదని సుందరయ్యగారన్నారు. ప్రభుత్వం వీలిచ్చినంతకాలమే కమ్యూనిస్టుపార్టీ శాసనసభల కార్యకలాపాల్లో పాల్గొంటుందని కూడా తెలియచేశారు.

ఆంతరంగిక శాఖామంత్రి డా॥ కైలాసనాథ కట్జూగారు చర్చకు సమాధానమిస్తూ సుందరయ్యగారి రాజీమార్గాలను నిరాకరించారు. ప్రభుత్వాన్ని ధిక్కరించే వారెవరినీ ప్రభుత్వం సహించబోదని చెప్పారు. సుందరయ్యగారి ప్రసంగంవల్లనే డిటెన్షన్ చట్టం ఆవశ్యకత తేటపడుతున్నదన్నారు. డిటెన్షన్ చట్టాన్ని అంతగా అవసరమైతే తప్ప ప్రయోగించవద్దని రాష్ట్రప్రభుత్వాలను కోరుతున్నట్లు కట్జూ తెలియచేశారు.

## కరువు నివారణ

రాయలసీమ ప్రాంతంలో కరువునివారణ నిమిత్తం కేంద్రప్రభుత్వం బోర్డు నొకదానిని స్థాపించడానికి నిశ్చయించినట్లు తెలుస్తున్నది. మద్రాసుప్రభుత్వం రాయలసీమ డెవలప్‌మెంటుబోర్డును స్థాపించినప్పటికీ ఆ ప్రాంతానికి సంబంధించిన ప్రత్యేక సమస్యల కనుగుణమైన పరిష్కార మార్గాలను అన్వేషించలేకపోయింది. మైనర్ ఇరిగేషన్ పారిశ్రామికాభివృద్ధి సహాయాల పరంగా రాయలసీమలో ప్రస్తుతం వెచ్చించబడుతున్న ధనం ఏమూలకీ సరిపోదు.

రాయలసీమలో మంచినీటికరువు పోవాలంటే ఇప్పటికృషి చాలదు. కేంద్ర ఆహారశాఖామంత్రి కిద్వాయ్‌గారు మంచినీటికరువు నివారణ నిమిత్తం ప్లానింగ్ కమిషన్‌కు కొన్ని సూచనలిచ్చినట్లు చెప్పారు. ఈ సమస్య ప్రాధాన్యతను ఇప్పటికైనా కేంద్రప్రభుత్వం గుర్తించింది. రాయలసీమలో ముఖ్యమైన సమస్య ప్రజల దారిద్ర్యం. ప్రజల కొనుగోలుశక్తి బొత్తిగా హీనంగా ఉంది. ఇతర ప్రాంతాలవారికంటె రాయలసీమప్రజలు మరీపేదలు. పారిశ్రామికాభివృద్ధికి అపూర్వమైన అవకాశాలున్నప్పటికీ, ఖనిజసంపద ఎంతగా ఉన్నప్పటికీ అభివృద్ధికాక పోవడానికి కారణం విద్యుచ్ఛక్తి లోపం. ప్లానింగ్ కమిషన్‌వారు ఈవిషయాన్ని కూడా గమనించడం ముఖ్యం. కృష్ణానది ప్రాజెక్టుల వివాదంలో రాయలసీమ నీటిఅవసరాలను ప్రధానంగా గమనించి నిర్ణయించడం అవసరం.

## సమాజసేవ

ప్రభుత్వ కార్యకలాపాల్లో ప్రజల సహకారాన్ని సాధించడంకోసం స్థాపించబడిన భారతసేవా సమాజనానికి ప్రధాని నెహ్రూగారు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు ఈసమాజసేవకులు ప్రభుత్వోద్యోగులు కారు కాని ప్రభుత్వంతో సన్నిహిత సంబంధం కలవారై ఉంటారు. వీరికి జీతాలుంటాయి. (అవి జీతాలు కావేమో. భత్యాలంటారు కాబోలు) రోజూ ప్రతి మనిషికీ నిత్యావసరాల సందర్భంలో ప్రత్యక్షమాతున్న కష్టాల నివారించడానికీ, తప్పనిసరిగా ప్రజలుతలొగ్గవలసి వస్తున్న మోసాలను బయటపెట్టి వ్యాపారంలో అవినీతిని నిర్మూలించడానికీ వీరు కృషిచేస్తారు. ఆరోగ్యనియమాలను ప్రజలు పాటించేలాగ వీరు ప్రచారంచేస్తారు. కుటీరపరిశ్రమల అభివృద్ధి మొదలైన కార్యక్రమాలలో తోడ్పడతారు.

ప్రభుత్వానికీ ప్రజలకూ మధ్య సన్నిహితభావం చేకూర్చి పరిపాలనా కార్యక్రమాలు సులువుగా కొనసాగేలా తోడ్పడుతూ, ప్రభుత్వ కార్యక్రమాలవల్ల ప్రజలకు సదుపాయాలు చేకూర్చడానికి కృషి చేస్తారు. ఈ కృషిలో పార్టీల ప్రసక్తి ఉండదు కాబట్టి సమాజసేవకులు సమాజంలో అన్నివర్గాలమధ్యనూ సహకారాన్ని సాధించడానికి వీలుంటుంది.

[15-8-52]

## విషయానుక్రమణిక

# పలుకు, ఉలుకు

**మన ప్రశస్తి**

తెలుగువాళ్లకి ఒక పెద్ద లోపముందని ఈమధ్య ఒక మిత్రుడన్నాడు. అదేమిటంటే! తన వాళ్ళని తెగనాడుకోడం, పరాయివాళ్ళ ప్రతిభకి మురిసిపోడం. కాని ఈలోపం అందరిలోనూ ఉన్నదా అనిపిస్తుంది. తెలుగువాళ్ళకే కాకుండా ఇతరులకి కూడా ఉండే ఈ లోపానికి మూలం ఇంకోటి అయుంటుంది. దూరపుకొండలు నునుపుగా కనపడతాయి.

బ్రిటన్‌లో ప్రజాస్వామ్యపు సాంప్రదాయాలు, అమెరికాలో సంపద్వృద్ధి, రష్యాలో దారిద్ర్యనిర్మూలనం మొదలైనవి తల్చుకుని అసలు మనదేశానికి భవిష్యత్తు లేదేమోనని భీతిల్లేవారున్నారు. కానిఅప్పుడప్పుడు వినవచ్చే నాయకుల ప్రసంగాల్ని బట్టి, ప్రచురించబడే వార్తల్ని బట్టీ ఇటువంటిభీతి నిరాధారమని తోచకమానదు.

రేషనింగ్, కంట్రోల్స్ పేర్లు వింటే మనదేశంలో అందరికీ చిరాకు కలుగుతుంది. ప్రభుత్వం అసమర్థత వీనివల్లనే వ్యక్తమౌతోందని కొందరంటున్నారు. ఇంక ప్రభుత్వానికి ఇంతకంటె చేతకాదని విమర్శించారు. వీటివల్లనే దేశంలో అవినీతి పెరిగిపోయిందన్నారు. ప్రభుత్వోద్యోగుల లంచగొండితనం వీనివల్ల బలిసిపోయిందిన్నారు. అసలు లోపం అంతా ధనికవర్గాలదే నన్నారు. ధనికవర్గాల అదుపులో ఉన్న ప్రభుత్వం ధనికుల లాభాల్ని మరింత వృద్ధిపరచడానికే కంట్రోల్స్ నిర్వహిస్తున్నారని కొందరన్నారు. లాభాలు చిక్కపోడానికివే కారణమని వర్తకులూ, వ్యాపారులూ అన్నారు. ఆహార ధాన్యాల ఉత్పత్తి తగ్గిపోడానికి వీటివల్ల రైతులకు కలిగిన ఇబ్బందులూ నిర్బంధాలే కారణాలన్నారు కొందరు రైతు వర్గాలవారు.

వీరనే మాటల్లో నిజం లేకపోలేదు. అయితే అంతా నిజం కాదనీ అందరూ ఒప్పుకుంటారు.

మన వ్యవహారాలని గురించి మనం చెప్పుకోడంలో అతిశయోక్తి దోషాలుండవచ్చు. కొన్నింటికి 'ఫరవాలేదులే' అని తృప్తిపడవచ్చు. అందువల్ల ఇతరులు కూడా, అంటే మనకి దూరంగా ఉండే వాళ్ళు కూడా ఏమనుకుంటున్నారో గమనిస్తే నునుపు ఏపాటిదో తేల్తుంది. అంతేకాదు ఇతరులతో మనల్ని పోల్చుకోడంలో కల దోషాలు వ్యక్తమౌతాయి. ఇతరులతో పోల్చుకుని మనవిషయాలపట్ల పెదవి విరుచుకుని చప్పరించెయ్యనక్కరలేదని కూడా తేలిపోతుంది.

మన రేషనింగ్ క చెప్తూ అమెరికా విదేశాంగశాఖ సం యు కార్యదర్శి జాక్ మెక్ఫాల్ ప్రపంచంలో అన్ని దేశాల్లోకీ మనదేశంలో అద్భుతంగా నిర్వహించబడుతున్నాయన్నాడు. ఆయన చెప్పిందంతా నిజమని కాదు. కాని నాలుగు దేశాల్ని గురించీ తెలిసినవాడు అలా చెప్తున్నాడంటే అందులో కొంతైనా నిజం ఉండకపోదు. చీనా కొమింటాంగ్ పరిపాలనలో మాదిరిగా జరక్కుండా, రేషనింగ్ కోసమంటూ భారతదేశంలో ప్రభుత్వాలు సేకరించిన ధాన్యమూ, దిగుమతి చేసుకున్న ధాన్యమూ ప్రజలకి వినియోగపడిందనే సంతృప్తి ఇతరులచేత అలా అనిపించి ఉండవచ్చు. ఆహారవస్తువులు ప్రజల కందడంవరకే కాని ఈలోగా ఏం జరిగిందో గమనించే అవసరం ఓపికా ఇతరులకు లేకపోవచ్చు.

ఇలాగే మనదేశంలో ప్రజాస్వామ్యం ప్రశస్తంగా కొనసాగిపోతోందని బ్రిటిష్ అమెరికన్ ప్రముఖులు అనేకమంది అన్నారు. మనం ఇక్కడ చూస్తే అన్నీ విమర్శలే. ప్రజాస్వామ్యం ఇంకా శైశవావస్థలో ఉందని మనవాళ్లు అందరూ అంటున్నారు

వీటిలో ఏది నమ్మడం? ఏదినమ్మినా నమ్మకపోయినా ఒకటిమాత్రం నిజం. ప్రజలలో అసంతృప్తి వ్యాపించి ఉంది. ఆ అసంతృప్తి పోయేవరకూ మన ప్రశస్తి గురించి చెప్పుకోడం నిరర్థకం. ఇతరులు చెప్తే ఆలకించడం అనవసరం. మనవాళ్ళని మనం తెగనాడుకోనక్కరలేదు ఇతరుల ప్రశస్తికి పొంగిపోవడం అనవసరం. 

## విజయదశమికి ప్రత్యేక సంచిక

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక రాబోయే విజయదశమికి (సెప్టెంబరు 28) పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. బాలబాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలతో, పాటలతో, వ్యాసాలతో, బొమ్మలతో ఆకర్షణీయంగా తయారవుతుంది. రచనలు పంపగోరువారు ఆగస్టు నెలాఖరులోగా మా కార్యాలయానికి అందేలాగ పంపాలి.

పిల్లలరచనా శక్తిని, చిత్రలేఖనశక్తిని ప్రోత్సహించే ఉద్దేశ్యంతో పోటీకూడా ప్రవేశపెట్టదలిచాము. పదిహేనేళ్లలోపు బాలబాలికలుమాత్రమే ఈ పోటీలోపాల్గొనాలి. పోటీకివచ్చినవాటిలో ఒక మంచికథకు, ఒక మంచిపాటకు, ఒక మంచి బొమ్మకు బహుమతులివ్వబడతాయి. రచనలు స్వతంత్రంగా ఉండాలి. రచయితలు తమవయస్సు, చిరునామా వివరంగా రాయాలి. పోటీకొరకు రచనలను, బొమ్మలను పంపేవారు; కవర్లపైగాని; లోపల వేరే కాగితంపైనగాని "పోటీకొరకు" అని స్పష్టంగా వ్రాయాలి.

—సంపాదకుడు

# నువ్వులు ★ ★ ★

శ్రీనాథకవి అనుభవించినంత రాజభోగం తెనుగు కవులలో ఇంకెవ్వరూ అనుభవించ లేదని ఆ మహాకవి జీవితకథ చదివినప్పుడు ఒక అభిప్రాయం కలుగుతూ ఉంటుంది. కాని, యీ కవిసార్వభౌముడు తన చివరి దశలో అనుభవించినన్ని కష్టాలు కూడా తెనుగు కవులలో ఎవ్వరూ అనుభవించ లేదని ఊహించవలసి వస్తుంది. రెడ్డిరాజుల వద్ద ఎంత సన్మానం పొందినాడో, ఒడ్డె రాజులవద్ద అంత అవమానం పొంది యున్నాడు. బొడ్డుపల్లె అనే అగ్రహారం ఆయనకు యిచ్చారు. ఆ అగ్రహారంలోని పంట అంతా ఒక్కసారిగా సర్వనాశన మైంది

కృష్ణానది వరదలమూలంగా కొంతపంట ధ్వంసమైంది. మిడతలదండు వచ్చి మరి కొంత పంట నాశనమైంది. 700 టంకాలు శిస్తుగా చెల్లించవలసివచ్చింది. కాని చివరకు చెల్లించలేకపోయినాడు. చేతులకు సంకెళ్ళు వేశారు. నడివీధిలో మండు ఎండలో నిలవబెట్టి బాధించారు ఆ కవి సార్వభౌముణ్ణి — వీరభద్రారెడ్డి ఆయనకు ఘంటేలి కడియం తొడిగి ఆయనను సన్మానించాడు. ఆ సన్మానం పొందిన చేతులకే ఎదురు గడియ బిగించి సంకెళ్లు వేశారు.

"కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయె-తిలలు పెసలు
బొడ్డుపల్లెనుగొడ్డేలి - మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు - లేడునూర్లు"
అని విలపించాడు.

ఇంతకూ ఆ కవిసార్వభౌముడు దానం పొందినటువంటి బొడ్డుపల్లె అనే గ్రామములో అప్పుడు పండిన పంట ఏమిటయ్యా అంటే, నువ్వులు, పెసలు తప్ప మరేమీ లేదు - కృష్ణాతీరంలో ఉన్న గ్రామం కావడంచేత ఆ పంట కృష్ణానదీ వరదల మూలంగా కృష్ణార్పణం అని కొట్టుకొని పోయింది. ఆ నువ్వుల పంట నాశనం కాగానే ఆ గ్రామానికి శ్రీనాథుడు తిలోదకాలిచ్చినట్లయింది.

బొడ్డుపల్లెగ్రామం అనేది శ్రీనాథమహాకవికి గడ్డుకాలం తెచ్చిపెట్టింది. అక్కడ ఆ ఊళ్లో ఉండి ఆయన సొంత వ్యవసాయం ఎన్నడైనా చేశాడా? హాయిగా రాజులతో సమానంగా భోగాలు అనుభవించి, కస్తూరి మొదలైన పరిమళ ద్రవ్యాలలో మునిగి తేలుతూ, "దాక్షారామపురీవిహారవర గంధర్వాప్సరోభామినుల"తో కలిసి విహరిస్తూ ఉండినటువంటి యీ రసికావతంసుడు మేనాలలో తిరిగినాడుగాని యీ మెట్టపొలాలలో తిరిగి వ్యవసాయం స్వయంగా చేశాడనిగాని చేయించాడనిగాని ఊహించడానికి అవకాశం లవలేశం లేదు కాని, జాతకం మంచిదైతే, యీ నువ్వులపంటతోనే, ఆరుపువ్వులూ ఏడు కాయలుగా వృద్ధిలోకివచ్చి, ఆ బొడ్డుపల్లెయే ఆయనకు "దొడ్డిగట్టిన వేల్పుగిడ్డి" వలె (పెరటిలో కట్టిన కామధేనువువలె) కొంగుబంగారంలాగున అక్కరకు వచ్చేది. కాని శనిచాలని పరిస్థితిలో పండిన నువ్వులన్నీ శని దానంక్రింద కృష్ణార్పణం అయినాయి — శనిగ్రహానికి ప్రీతికరమైన యీ తిలలు పండేటటువంటి బొడ్డుపల్లె శ్రీనాథకవిని చాలా మోసం చేసింది. ఆ గ్రామాన్ని తిలఘాతకురాలని తిట్టి దూషించినాడేమో కూడా ఆ మహాకవి. ఒకానొక సందర్భములో ఒకానొక తిలఘాతకురాలే నిజంగా మోసంచేయగా దానిని దూషించి తన ఆగ్రహం చూపించాడని అంటారు. ఆ పద్యం అచ్చువేసిన వారిమీద మన లేటు బ్రిటిషుప్రభుత్వంకూడా ఆగ్రహంచూపించింది. శ్రీనాథుడు తిలఘాతకురాలిని తిట్టుతూ వీధినాటకంలో విరచించిన పద్యం మూలంగా క్రిమినలు కేసు వ్యవహార చర్యలు జరిగినవి. కాని ఈ క్రిమినలు వ్యవహారంలో శ్రీనాథుడినే కోర్టుకు రప్పించి, అడగవలసిన విషయాలన్నీ మర్మం లేకుండా అడిగి, మరొకసారి దండించవలసింది. అస్తమించిన కవి సార్వభౌముణ్ణి అవిధంగా దండించలేక ఆయన పద్యాన్ని అచ్చువేసిన వారిపై అధికారులు దండెత్తుట జరిగింది. కీ॥ శే॥ శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి ఆ తిలఘాతుకురాలెవరో తెలిసి యుండక పోయినప్పటికీ, దాని మనస్సుకు ఆ పద్యం మూలంగా నొప్పి కలుగవలసిన అగత్యం లేదన్నారు. ఆతిలఘాతకురాలు తెలికల జాతి స్త్రీ స్థూల శరీరానికిగాని సూక్ష్మ శరీరానికిగాని కించిత్తయినా నొప్పి కలిగించే పని శ్రీనాథుడు ఆ పద్యంలో ఉద్దేశించలేదన్నారు. ఆ పద్యంమూలంగా ప్రభుత్వాధికారుల మనస్సుకుకూడా నొప్పి కలుగవలసిన అగత్యం లేదన్నారు.

అశ్లీలమును అవినీతిని నిర్మూలించడానికి ప్రభుత్వం కంకణం కట్టుకొన్నమాట నిజమే — కాని, యీ ప్రభుత్వాధికారులలోనే అవినీతి అధికంగా ఉన్నదనే జనఘోష ఒకటి బయలుదేరింది. లంచగొండితనం అనేది, అధికారుల మంచితనాన్ని బట్టి అదికూడా వారిలో ఉండదగిన ఒక ధీరోదాత్త లక్షణమనిన్నీ, ఉదార స్వభావమనిన్నీ ఊహించి మెప్పించి అట్టి అధికారులను ఆశ్రయించి కోరినవరములను పొందేవాళ్లు ఉన్నారు. ఆ మాటకువస్తే, శ్రీకృష్ణునివద్దకు వెళ్లినప్పుడు కుచేలుడు కూడా ఉత్తచేతులతో వెళ్ళలేదు. ఏవో తన శక్తికొలదీ, కమ్మని అటుకులు కొంగున కట్టుకొని వెళ్లాడు. "ఈఅటుకులు(పృథుకండులములు) నాకెందుకు? ఇటువంటివి నీవద్ద నేను పుచ్చుకుంటే, అవినీతి నేరం అవుతుంది" అని శ్రీకృష్ణులవారు నిరాకరించలేదు. "ఇవిగో అటుకులు మీకు తెచ్చాను" అని యివ్వడానికి కుచేలుడు సందేహిస్తే, శ్రీకృష్ణుడే అవి తీసికొని ఆరగించాడు. అందుకు ప్రతిఫలంగా కుచేలునకు సమస్త అయిశ్వర్యమూ యిచ్చి తన ఆశ్రిత పక్షపాతం చూపించాడు. శ్రీరాములవారు శబరి ఎంగిలిచేసియిచ్చిన పండును పరమానందంతో స్వీకరించి ఆరగించారు. నిజంగా శ్రీరాములవారు అవిధంగా శబరివద్దనుంచి ఎంగిలిపండును స్వీకరించడం అవినీతి అయినట్లయితే, "ఎంతని నే వర్ణింతును శబరీ భాగ్యము — ఎంతని నే వర్ణింతును" అని త్యాగరాజులవారు ఆనందపరవశులై ఆమెను అభినందించడం జరిగేదికాదు.

తాపి ధర్మారావు

ప్రభువులపై భక్తి ప్రజలకు ఉండాలి. భక్తి ప్రపత్తులతో ఒకరి సన్నిధికి వెళ్ళేటప్పుడు, ఫలం, పుష్పం, పత్రం, తోయం యివియేవైనా తీసికొని వెళ్లాలి. వాటిని వారు స్వీకరించి మనలను ఆశీర్వదించాలి. "కోరిన వరమొసగుమయ్యా కోదండపాణి" అని ప్రార్థించినప్పుడు కోదండపాణి కోపించి కొట్టవస్తే, అది ఉదాత్త లక్షణమూ కాదు, దాత లక్షణమూ కాదు- ఎటువంటి ప్రభువు కావాలి మనకు? మనమిచ్చే పత్రం ప్రసన్నవదనులై స్వీకరించాలి. శతపత్రం(అంటే తామరపూవు) కూడా అర్పించి అర్పించవచ్చునన్నారు. కాని, నూరురూపాయలనోటును ఒక పెద్దమనిషి ఒక అధికారికి సమర్పించివచ్చి, శతపత్రార్చన చేశానన్నాడు. ఇంకో పెద్దమనిషి అష్టోత్తరశతపూజ చేశానన్నాడు. అష్టోత్తరశతం అంటే నూటఎనిమిది-కాని, సహస్రార్చన చేయడం కూడా సాహసమైన పనికాదు. గడచిన యుద్ధకాలంలో ఏ. ఆర్. పి. వాళ్లు దీపాలార్పిన బ్లాకవుట్ చీకటి రోజులలో పై విధంగా ఇష్టదేవతలను అర్పించి అష్టయిశ్వర్యములనూ పొంది, కుచేలులు చాలామంది కుబేరులైనారు. ఆ బ్లాకవుట్ రోజులలోనే బజారులన్నీ చీకట బజారులైనాయి.

ఈ చీకటిలో చేసిన చీకటి తప్పులకు ఎవరినైనాసరే, ఎంతవారినైనాసరే దండించడానికి వీలులేదని మన స్వరాజ్య ప్రభుత్వం కూడా అన్నది. చంద్రుడువచ్చి బట్టబయలుగా వెన్నెల ప్రకాశించిన తర్వాత కూడా ఆనాటి "చీకటి తప్పులు" బయటపడక మానవు అనే ధైర్యంతో మన ప్రభుత్వాధికారులున్నారు. కాని చీకటి తప్పులు చేయడంలో అగ్రతాంబూలం చంద్రుడే స్వీకరించాడని తారాశశాంక విజయమే ఘోషిస్తోంది. తాటాకులలో వ్రాసిన ధర్మశాస్త్రాలే తప్పుల తడికలని తార చంద్రుణ్ని దూరింది. అవినీతిని శాసించిన అధికారుల చెవులకే తాటాకులు కట్టింది. అటువంటి సందర్భములో స్వరాజ్యం వచ్చిన తర్వాత ఈ బ్లాకు మార్కెటు వ్యాపారలాభాలను, ఆ నాటి చీకటితప్పులు చేసిన నవమన్మధాకారులే లక్ష్మీపుత్రులే తమంతటతాము బయట పెట్టాలిగాని, చంద్రుడైనా, ఇంద్రుడైనా, రాజేంద్రుడైనా పసిపట్టలేడు. ఆ నాటి బ్లాక్ మార్కెట్ వ్యాపారలాభాలు ఏ లెక్కలలోనూ కన్పించలేదు. ఎక్కడైనా ఊపావిడిచి బయటికి కన్పిస్తే, ఇంకంటాక్సు ఆఫీసర్లు కన్నువేసి కన్నుగీటి పన్నువేస్తారు. అందుకని "దాగుడుమ్రుచ్చులు - దండేకోర్! పిల్లివచ్చె ఎలుకా హుషార్! ఎక్కడి దొంగాలక్కడే!" అని వాణిజ్యరంగంలోని పెద్దపెద్ద వణిజులంతా వణికిపోయినారు. దొంగ వ్యాపారలాభాలు బయటపెట్టితే ప్రాసిక్యూషను చేయక ప్రశంసిస్తామనే అభయహస్తం అధికారవర్గం యిచ్చింది. ఇవిగో లెక్కలని కోట్లకొలది మొత్తాలు కొంతవరకు బయటకు వచ్చాయి. పెద్ద పాములు చిన్నపాములు పుట్టలలోనుంచి వచ్చాయి. సుబ్బారాయుడు పైకివచ్చి పడగవిప్పి ఆడితే, నమస్కారం చేసి పుట్టలో పాలుపోసికోవలెనేగాని, అవన్నీ విషసర్పాలని దూషించి కర్రతో కొట్టడం న్యాయంకాదని మన నమ్మకం. గాంధి మహాత్ముడుకూడా ఒకసారి తాచుపాము తన ప్రక్కగా పోతూఉంటే, "దాని దారిని అదే పోతుంది. దాన్ని ఏమీ చెయ్యద్దు" అని నిర్లిప్తంగా ఉన్నాడు. సర్పాలలో కూడా సత్యం ఉందని మన మతం. అందుకనే మన ప్రభుత్వం బ్లాకు మార్కెటు వ్యాపారలాభ భాగస్థులను నాగస్వరం పాడి జాగ్రత్తగా ఆడిస్తున్నారుగాని ఆరడిచేయడంలేదు. సాహుకార్లలోఉన్న సత్యం, సర్కారు ఉద్యోగిలో ఉండదా? సుబ్బారాయుడులో ఉన్న సత్యం సబార్డినేట్ ఆఫీసరులో ఉండదా? కనుక, అధికార్లలోని అవినీతికీ, సాహుకార్లలోని అవినీతికీ అదరడం బెదరడం అనవసరం - అదే దేశ కల్యాణానికి అపస్వరం - లంచం ఇచ్చినవాడిని దండిస్తేచాలు. "అంగ వ్రాతములో చికిత్సకుడు దుష్టాంగం ఖండించి" నట్లవుతుంది. ఇదే "లంచవిచ్ఛేద మంత్రం" అన్నారు. ఈ విధంగా ఢిల్లీప్రభుత్వం యిటీవల అవినీతి నిర్మూలనకు సాధన విధానం నిర్ణయించింది. ఏ అవయవంతో ఏ అవినీతి కార్యం స్త్రీ గాని పురుషుడు గాని చేస్తారో దానినే దండించి ఖండించాలనే అభింశులుకూడా ఉన్నారు.

దేశంలో అమలుపరుస్తున్న పెద్ద పెద్ద ప్రాజెక్టుల సందర్భంలో దుబారావ్యయం అవుతోందని భారత శాసనసభలోని సభ్యులు శివమెత్తినట్లుగా ఉపన్యసించారు. అందుకు సంబంధించిన అమాత్యశేఖరుడు గుల్జారీలాలు నందాగారు ఒక గంటపైన నలభైనిమిషాలసేపు అనగా శతనిమిష దీర్ఘోపన్యాసం చేశారు. ఈసారి పార్లమెంటు సమావేశంలో ఇంత పెద్ద ప్రసంగం జరిగినసందర్భం ఇంకొకటిలేదు.

అయినా, బ్రహ్మాండమైన కార్యభారాలు వహించి నిర్వహించేటప్పుడు నలుగురూ నాలుగు అక్షింతలు వేయక మానరు.

మితిమీరిన ఖర్చుచేసి కొండను త్రవ్వి ఎలుకను పట్టడం పరిపాటి అయింది. అన్నారు.

"జిల్లెడు దూదికై పుడమి
దున్నెన్ పైడి నాగళ్ళచేన్".

(జిల్లేడు దూదిని పండించడానికి బంగారు నాగళ్ళతో భూమిని దున్నినాడు) అన్నట్లుగా ఉంది. "సుశ్రీఖండ ఖండంబులన్ దిలపిణ్యాకము వండెనెవ్వడు" (మంచిగంధపు చెక్కలను కాల్చి తెలగపిండిని ఎవ్వడు వండెనో) వాని పద్ధతిగా ఉంది మన ప్రాజెక్టుల పోకడ.

"భారతద్రవ్యం దుబారా" అన్నంత కాలం "భారతదేశ్ హమారా" అని చిందులుత్రొక్కి భారతమాత భజన చేయడం కేవలం భారతమాతకు భరతం పట్టినట్లవుతుంది. కోట్లకొలది ద్రవ్యం ఖర్చుచేసి పంటల అభివృద్ధికోసం విదేశాల నుండి ఎరువులు తెప్పిస్తే, ఆ ఎరువుల వ్యవహారంలో హరించిన ద్రవ్యం ఇంతా అంతా కాదు. పెద్దప్రాజెక్టులు ఏవి ప్రారంభించినప్పటికీ, "బిలబిలాక్షులు తినిపోయె తిలలు పెసలు" అన్నట్లవుతోంది. ఇంతకూ ఈ "బిలబిలాక్షులు" అనబడేవి ఏమిటో నిర్ధారణ కాలేదు.

"బిలబిలాక్షులు" అంటే మిడుతలు అని కొందరు ఊహించారు. "ఎలుకలు" కావచ్చునని మరికొందరి అభిప్రాయం - అవి పక్షులన్నారు తదితరులు. ఆ మాటకు అర్థం ఏమిటో పండితులు నిఘంటువులు వెతికి రూఢిపరచవలసి ఉన్నది. మన దుబారావ్యయ బిలబిలాక్షులను కనిపెట్టడానికి గట్టి కమిటీలను కొన్ని నియమించాలి.

ఏమైనప్పటికీ ప్రభుత్వాధికార్లు ఎక్కువ శ్రద్ధగా నిర్వహించవలసిన పెద్ద ప్రాజెక్టుల విషయంలోనే వారికికూడా పదిమందిచేత పదిమాటలు పడవలసివస్తుంది. అక్షతలు పడకమానవు. శ్రద్ధగా నిర్వర్తించవలసినదే శ్రాద్ధం అన్నారు. ఏ శ్రాద్ధ సందర్భంలోనైనా కొద్దిగా కొన్ని నువ్వులు కూడా తలపైన పడకతప్పదు. ఉద్యోగాధికార్ల చేతికి రవ్వంత తిలలుగాని, తైలంగాని అంటకుండా శ్రాద్ధతుల్యమైన ప్రాజెక్టుల పని పూర్తికాదు. అక్షతల రూపంలో తండులాలు పడినట్లుగానే తిలలుకూడా వారి చేతిలో పడతాయి. ఇదికూడా ఒక తిల తండుల న్యాయమే.

పూర్వమొక బ్రాహ్మణుడు తద్దినపు భోక్తగాఉండి తిలతర్పణాలు చేయించి

చక్కపూటుగా భోజనం చేసి భుక్తాయాసంతో ఒకరియింటి ఎత్తయిన అరుగుమీద శయనించాడు. నిద్రలేచి వీపుగోకుకొనుచున్న సమయంలో శ్రాద్ధకాలమందు ఆయన వీపున అంటుకొన్న నువ్వుగింజ ఒకటి చేతికి తగిలింది. దానిని బాగా చేతితో తడివిచూచి తన పెరట్లో ఆనువ్వుగింజను నాటవచ్చుననుకొన్నాడు. అప్పుడది మొక్కగా పెరిగి ఫలించితే చేరెడు నువ్వుగింజలైనా వస్తాయిగదా! ఆరెచేడు గింజలను తిరిగి జల్లితే, కుంచెడు గింజలు ఫలిస్తాయిగదా! ఆ విధంగా తిరిగి పైరు చేస్తే పుట్లకొలదిగా పంట పండుతుంది గదా! ఆ ద్రవ్యంతో మేడ కట్టించి దానిమీద పవళించవచ్చునుగదా! అప్పుడు నా భార్య నన్ను బ్రతిమాలేవరకు మాట్లాడక భీష్మించి మాతిబిగించి పెడముఖంగా వెనుకకు దొరలిపోతాను అని గొంతెమ్మకోరికలు కోరుతూ వెనుకకు తిరిగి అరుగుమీదనుంచి అకస్మాత్తుగా పడ్డాడు - కాని, అధికాహారోత్పత్తి విషయంలో కొన్ని పథకాలు తయారుచేయక తప్పదు - పంచవర్షప్రణాళికలకోసం తపస్సు చేయకతప్పదు - ప్రణాళికలకు కావలసిన ద్రవ్యం ఏది? అదే అర్థంలేని సందేహం - గారెలు చెయ్యడానికి ఏం కావాలంటే, రంధ్రంచేసే వేలుందిగాని మిగిలినవన్నీ కావాలి అని భర్తతో చెప్పింది ఒక యిల్లాలు. అయినా, యీ పంచవర్ష ప్రణాళిక అంతా "తిలకాష్ఠ మహిష బంధం"గా తయారైంది. వసుచరిత్ర అనే మహాప్రబంధానికి యిమిటేషనుగా పూర్వకవులు చాలామంది అనేక ప్రబంధాలు వ్రాశారు. వాటి పేర్లుమాత్రం చాలా ఆగ్భాటంగా ఉండేవి. "కవిజన మనోభిరామం" అని ఒకరు నామకరణం చేస్తే "కవిజనచకోరచంద్రోదయం" అని యింకొకరు నామకరణం చేశారు. ఈ భేషజంఅంతా చూచి, ఒక పూర్వకవి నువ్వుకాడలను గేదె పలుపుతో కట్టి దానికొక అంగవస్త్రంచుట్టి చంకలో పెట్టుకొని పోతున్నాడు. ఒక పెద్దమనిషి అది చూచి "స్వామీ! తమ చంకలోని గ్రంథం ఏమిటి?" అని ప్రశ్నించాడు. అది "తిలకాష్ఠ మహిషబంధం" అన్నాడు. రష్యా మొదలైనదేశాలలో పంచవర్ష ప్రణాళికలను రచించడం ఆచరించడం జరుగుతోంది. అందుకు ఇమిటేషనుగా మన పంచవర్ష ప్రణాళిక కూడా తయారవుతోంది. ప్రజలకూ ప్రభుత్వానికీ ఉండే బాంధవ్యం తెగకుండా కాపాడడం కొరకైన ప్రజాప్రభుత్వబంధం ఇది. కాని, అర్థంలేని మహాప్రబంధం అని మన భారత ఖజానా మంత్రియైన చింతామణి దేశముఖుగారే మనవి చేశారు. ఈ ప్రణాళికకు కావలసిన అర్థబలం ఎట్లా లభించగలదో బోధపడడం లేదన్నారు.

(54-వ పేజీ చూడండి)





బృందావన గార్డెన్స్, మైసూరు.

ఛాయా చిత్రకారుడు : సినీ నటుడు శ్రీ ఎ. నాగేశ్వరరావు.





# దివాలా

శ్రీ పి.వి.రత్నం

కుటుంబరావు—వర్తకుడు
కాంతమ్మ—అతని భార్య
రామచంద్ర—ఏకైకపుత్రుడు
కృష్ణమూర్తి—భూస్వామి

మొదటిరంగం

కుటుంబ: పేపరొచ్చిందా....అబ్బాయ్...బంగారం రేటు ఎలా వుందో చూడు నాయనా...నిన్నె్రా. అస్తమానుఆ పుస్తకాలు పట్టుకొని ఏడుస్తుంటావేమిరా...కానీ లాభం వచ్చేది వుండదు కాని...

రామ: పట్టుకొస్తున్నా పేపరు నాన్నగారూ...67-10-0 ధర వుందండీ...

కుటుంబ: ఈవేళ 'బేస' దిగిందన్నమాట! ఊఁ సరే.. ఒసే.. వంట అయిందా? ఏమిటే... ఇంటోనుంచి ఊడిపడవు... పది వంటలు చేసి పడేస్తున్నట్టున్నావ్... బండికి వేళవుతోంది..

కాంతమ్మ: మీదంతా చిత్రమండీ... పదికూరలంటారు లేకపోతే ఇరవై అంటారు...సోమవారం పదలందోసకాయలు తెచ్చారో లేదో...కూరలు వండడానికేమున్నాయిలెండి.....నెయ్యి అయిపోయిందండీ.. మూడు రోజులనుంచీ మొరపెట్టుకున్నా తీసుకొని రారాయె.

కుటుంబరావు: అయితే ఏబులం నెయ్యి నెలరోజుల్లో అయిపోయిందేమిటే ఇలా అయితే ఈ కుటుంబరావు 'దివాలా' తీశాడన్నమాటే...

కాంతమ్మ: మాటిమాటికి దివాలా దివాలా అంటారేమిటండీ అశుభం మాటలూ మీరూనూ?

కుటుంబరావు: లేకపోతే ఏమిటే? నీకేమి తెలుస్తోందంటున్నా...ఈవేళ 'బేస' దిగింది బంగారం రేటు...ఇప్పుడు గుంటూరు వెళ్ళాలి...త్వరగా తేల్చు...

కాంతమ: ఇదిగో బెండకాయ వేపుడు పెట్టేసి...

కుటుంబరావు: అబ్బ! ఇప్పుడు బెండకాయ వేపుడు పెట్టకపోతే కొంపమునిగింది కాబోలు...ఆ! ఇదిగో. నిన్నే నే.. ఈ చీపురు బైట అరుగుమీద పడేసిందెవరే?

కాంతమ్మ: నా మతి మండ. ఇందాక ఊడుద్దామని అక్కడే పెట్టివేశా. వార్పు తీయాలని పరుగున వచ్చా ఇంట్లోకి. వచ్చి తీస్తానుండండి.

కుటుంబరావు: నేను చెప్పాను కదూ? నీ చల్లటి కాపురంవల్ల కుటుంబరావు దివాలా తీయడం ఖాయమేలే...ఎన్ని చీపుర్లు కొన్నావో గుర్తుందా?

కాంతమ్మ: ఈ కాంతమ్మ పీక పిసుకుతున్నారు బాబు...అన్నింటిలోను మీకే కావాలి...నేనేదో దుబారాగా ఖర్చు చేస్తున్నాననేగా మీ ఉద్దేశ్యం?

కుటుంబరావు: ఏమన్నా అంటే అలా విసుక్కుంటావేమిటే? ఎవరైనా వస్తే వీధి అరుగుమీద కూర్చుంటారని చీపురుకట్ట తీయమన్నా కాని..

కాంతమ్మ: చాలెండి. సర్ది చెప్పడానికి మీవంతే...ఈలోపుగా పట్టుపంచె కట్టుకోండి...

కుటుంబరావు: అలాగే.. ఒరే అబ్బాయి... అదేమిట్రా ఆ గదిలో ఖాళీగా కూర్చోకపోతే ఆ చిట్టా అవర్జా తీసి పద్దులు చూడకూడదురా?

రామచంద్ర: ఏదో పని చేయించకపోతే మీకు కడుపు నిండదుగా... చూస్తానులెండి...

కుటుంబరావు: అది కాదురా నాయనా...ఇదంతా ఎవరికోసంరా ... ఆమాత్రం నేర్చుకొనకపోతే ఎట్లా బ్రతుకుతావురా...

రామచంద్ర: వ్రాస్తానన్నాను కదండీ.

కుటుంబ: అంత కోపం పడితే ఎట్లారా? కోపం కోమటింట్లో వుంటే కీడురా నాయనా...ఎంత మెత్తగా వుంటే అంత మంచిది బాబూ...

రామచంద్ర: ఇది మరీ బాగుంది. ఇప్పుడే కదండీ ప్రాంసరీనోట్లు తిరగేయించారు...కొంచెం విశ్రాంతి తీసుకొన్నానో లేదో...

కుటుంబ: వెయ్యికళ్లుండాలిరా... లోకం సంగతి నీకేం తెల్సు...కోమటి అంటే అందరికీ లోకువకదరా. జాగ్రత్తగా, బాకీలు వసూలుచేసుకుందామనే ఆనోట్లు చూడమన్నాను. ఇంతకీ నిన్న రాత్రి సినీమాకు రూపాయి ఇవ్వలేదనే కదూ కోపం?

రామచంద్ర: అదేమీ కాదు.

కుటుంబ: ఒరే, ఖర్చు పెట్టడంచేతనయిందికాని నీకు, కానీ సంపాదించగలవా నువ్వు? అయినా రెండునెలలుకూడా అవలేదు సినిమాకు వెళ్ళి.. గడిగడికీ ఇలాగైతే సంసారం ఇంకేమైనా వుంటుందిరా...

రామచంద్ర: ఎలాగైతే ఇచ్చారులెండి బోడి రూపాయి...

కుటుంబ: నీకెన్నో సార్లు చెప్పా, ముక్కున ఆ కోపం వద్దని...

బోడిరూపాయి అంటావేమిట్రా! లక్ష్మిని అట్లా దూషించవచ్చురా...లెంపలు వేసుకో, కళ్లు పోతాయ్ వెధవపీనుగా.

రామ: ఎప్పుడూ ఇంతేమీరు...ఇదిగో లెంపలు వాయించుకుంటున్నాను లెండి.

(భార్య లోపలనుంచి భోజనానికి, రమ్మనిపిలుస్తుంది బిగ్గరగా)

కుటుంబ: ఊఁ సరే లే భోజనానికి. భోజనం చేసి పాపయ్యా తొమ్మిది అణాలు ఇవ్వాలి అడిగి తీసుకొనివచ్చి మీ అమ్మకు ఇయ్యి.

రామ. సరే లెండి.

కుటుంబరావు: ఏమే...మొన్న కరేపాకునెట్టు అమ్మాంకదా... రూపాయి పావలా ఎంకమ్మ తెచ్చి ఇచ్చిందా?

కాంతమ్మ: ఆ ఇచ్చిందండోయ్. మర్చాను మీతో చెప్పడం...

కుటుంబ: ఆ మరుపే వుండకూడదంటాను...ఆవేళ చూశాను పెరుగు దానికి అణా ఎక్కువ ఇచ్చావ్!

కాంత: పదేళ్ళ సంగతి ఇప్పుడెందుకండీ...ఆ.. వడియాలు తినరేం?

కుటుంబ: ఇన్ని వడియాలు ఎందుకు చెప్పు.. నెయ్యి లేదమిటే.. పోనీలే... ఒరే అబ్బాయీ.. నీవు మర్చిపోకురోయ్ పాపయ్యదగ్గరకు వెళ్ళడం... ఏమెవ్... మినుము కుట్టువాడు తలగడగుడ్డ పట్టుకొచ్చాడేమిటే?

కాంత: లేదండీ..... ఇంత ఆలస్యం దేనికో మరి...

కుటుంబ: సరే నీవు వచ్చేటప్పుడు ఆ తలగడగుడ్డ అడిగి తీసుకొని రారా...

రామచంద్ర: అలాగేనండీ...గుంటూరు వెళ్తున్నారుకదూ! నాకు షర్టింగ్ క్లాత్ ఏమైనా...

కుటుంబ: మొన్న సంక్రాంతికి కుట్టించుకున్నావ్...అప్పుడే బట్టలేమిట్రా ఎన్ని వున్నా సరిపోవేమిటి?

రాము: అన్నీ ఎన్ని వున్నాయ్? అన్నీ కురచ అయిపోయాయ్. కొన్ని బొత్తిగా చిరిగిపోయాయ్.

కుటుంబ: చిరిగిపోతే మిషనోడిచేత కుట్టించుకోవాలి కాని పారేస్తావేమిట్రా. కురచైపోతే తొడుక్కోవడానికేం?... ఇదేమైనా మజ్జిగ, తపాలానిండా వుంది? ఎక్కువైతే అర్ధణామజ్జిగ తగ్గించివేయరాము?

రాము: బాగా పల్చగా చేసిందంటే... ఆ బట్టలు వేసుకొని, స్కూలుకు వెళ్ళడానికి సిగ్గాగాకూడా వుంది...మీరేమో...

కుటుంబ: నేను చొక్కాయలేకుండా వెళ్ళటం లేదురా బజారులోకి. ఒకరను కుంగారగ నడిస్తే కొంప నట్టేటిలో కలవవలసిందే..

రాము: పోనీలెండి...... ఎన్నాళ్ళు చెప్పినా ఇలాగే చెప్పారు....పుస్తకాలు కొనుక్కోవాలి... లెఖ్ఖ ఇవ్వండేమైనా.

కుటుంబ: బండికి టైము అయిపోయినట్టుంది.. దొరుకుతుందో, దొరకదో...ఆ పాతపుస్తకాలు ఏమి చేశావురా మరి?

రాము: సుబ్బారావు అనేబీదోళ్లబ్బాయి అడిగాడు.. ఇచ్చివేశాను...నాకు పనికి రావుగా.

కుటుంబ: (నోరు గట్టిగా నొక్కుకుంటూ) అవ్వ! ఇలాగైతే ఇక దివాలా తీయవలసిందే...సగం డబ్బు అయినా ఇవ్వకపోతే ఎట్లా? నీ తెలివి మండినట్టే వుంది. మా నాన్న ముందుగా ఎవరికో ఇస్తానని చెప్పారట అని అడిగి తీసేసుకో.

రాము: బాగానే వుంది.. సరేలెండి.

కుటుంబ: అన్నీ నీకు తోచినట్టుగానే చేస్తావన్నమాట... పెద్దలతో చెప్పక్కరలేదన్నమాట.. వాటిని అమ్ముకుంటే కొంత డబ్బు వస్తుంది. నీవు కూడా ఏ పాతవో కొనుక్కో...పోనీ శేషావతారం బావగారబ్బాయిని అడిగి తీసుకోకూడదూ?

రాము: ఆ మరే. ఎవరిస్తారేమిటి? మనం అమ్ముకోవాలి...వాళ్ళు దానం చేయాలి కాబోలు...

కుటుంబ: ఏడ్చావులే...ఇంత దద్దమ్మవు అయిపోతే ఎట్లారా? ఏమేవ్... నిన్నే...అబ్బబ్బ...బండికి టైముఅయిపోయింద...త్వరగా శకునం రావే...

కాంతమ్మ: వస్తున్నానండీ..... అక్షరక్షరం చెప్పి మరీ వెళ్తారు కొంప మునిగినట్టు. ఎప్పటినుంచో ఈ ప్రయాణం...

కుటుంబ: (వెళ్తూ) జాగ్రత్త ఇల్లు... తలుపులు వేసుకొని మరీ పడుకోండి... రేపు సాయంత్రానికి వచ్చివేస్తానులే... ఒరే...అబ్బాయ్...ఆ బాకీ వసూలు చేయరోయ్ వెళ్లి...ఇప్పటికే చాలా రోజులైపోయింది...(కంగారుగా వెళ్తాడు)

* * *

(కొద్ది నిమిషాలు శబ్దం)

* * *

(తలుపుకొట్టిన శబ్దం వీధిలో)

కాంతమ్మ: (లోపలనుంచే) ఎవరండీ?

కృష్ణమూర్తి: నేనండీ....: కృష్ణమూర్తిని.. కుటుంబరావుగారు లేరండీ...

కాంతమ్మ: ఎందుకండీ?

కృష్ణ: ఉన్నారో లేరో చెప్పకూడదామ్మా, ఎందుకో మీకెందుకంటా.

కాంత: చెప్తే పోయిందేముందీ... అడగమన్నారు కాబట్టి అడుగుతున్నాం.

కృష్ణ: (విసుగ్గా) వారు నాకు డబ్బు ఇవ్వాలి లెండి...

కాంత: ఎందుకివ్వాలి? ఎప్పుడిచ్చారు మీరు?

కృష్ణ: ఆడవాళ్ళకు ఇవన్నీ ఎందుకమ్మా? వారు ఉన్నారా లేరా అని అడుగుతుంటే అన్నీ ఆరాలు తీస్తారు...

కాంత: గుంటూరు వెళ్లారండీ.. అంత కోపమైతే ఎలాగండీ.. వారం రోజులవరకు రారు...

కృష్ణ: అదీ సంగతి.. నేను డబ్బుకొచ్చానన్నేసరికి ఇంత రాద్ధాంతం చేశారు... తెలివంటే అలాగుండాలి...

కాంత: మాకేమి తెలుసండీ.. వారం రోజులవరకు రానన్నారు కాబట్టి చెప్పాం...

కృష్ణ: సరే లెండి.. వచ్చి వెళ్లానని చెప్పండి...(వెళ్లబోతుంటే)

కుటుంబ: (చిరాకుగా వస్తూ) ఛీ ఛీ కాలవస్టైలదగ్గరకు వెళ్ళేసరికి బండి కూత వేసేసింది.. ఓహోహో...కృష్ణమూర్తిగారా? వెళ్ళిపోతున్నారేమిటి? రండి రండి—ఏమిటి విశేషం?

కృష్ణ: అప్పుడే వచ్చారే.. వారం రోజులవరకు రారని చెప్పారు మీఇంట్లో..

కుటుంబ: అవునండి...బంధువుల ఇంటికి వెళ్దామనుకుని...ఆ! దానికేం గాని దాహం కావాలా? ఈమధ్య ఎక్కడా కన్పించడంలేదే?

కృష్ణ: పొలంపనులతో సరిపోతోందండీ...తీరుబడి ఎక్కడేడుస్తోంది... కొంచెం పనుండివచ్చా...

కుటుంబ: ఇప్పుడే వచ్చేస్తా... కూర్చోండి బాబూ. పదినిమిషాలంతే... బట్టలు మార్చుకొని వస్తా.

కుటుం: ఏమేవ్ ... నిన్నే (లోన కేకలు)

కాంత : వస్తూన్నానండీ...కిరసనాలు పోస్తున్నా లైట్లలో...

కుటుంబ. ఎప్పుడూ కిరసనాలేనా ఏమిటే...ఇలాగైతే దివాలా తీయవలసిందే...రాత్రులు పెద్ద వత్తుచేసి, కొగడాలలా వుంచకపోతే ఆర్పుకోకూడదూ! ఇంకెలా బ్రతుకుతావే...

కాంత : మీరు మరీనండీ...ఇంత పిసినిగొట్టు అయిపోతున్నారేమిటి?

కుటుం : ఇదంతా ఎవరికోసమే...నే నెంత చమటోడ్చి సంపాదిస్తున్నానో నీకు తెలియదాయె.. ఒబ్బిడిగా ఖర్చు కావాలంటున్నా.. ఈ సంవత్సరం ఎంత ఖర్చు అయిపోయిందో తెలుసా? ఇదిగో తాళం చేతులు ఇలా ఇయ్యి...

కాంత : పరుపు క్రింద పెట్టానండీ...

కుటుంబ : అవ్వ! పరుపుకింద అంత అజాగ్రత్తగా పెట్టేస్తే ఎవరైనా తీసేస్తే ఇంకేమైనా వుందా? అబ్బాయికంట బడితే ఇనుపపెట్టి బద్దలు కొట్టడూ?

కాంత : వాడిమీద అలా విరుచుకుపడతారేమిటండీ ... ఒక్కగాని ఒక్క కొడుకు...ఖర్చో ఖర్చో అంటారు...

కుటుం : వాడెంత ఖర్చు చేస్తున్నాడో నీకు తెలుసా? నాలుగు రూపాయల మూడు అణాలు బాకీవుందట కాఫీ హోటల్లో..ఇంకేమైనా వుందా కొంప? వెధవ వేషాలు కాకపోతే మరేమిటి? అవి తినకుండా వుండలేడూ? నీవు వాడ్ని వెనకేసుకొనిరావడంచేతే వాడిలా చెడిపోతున్నాడు ...ఆ మర్చాను...ఆ గోనెసంచి ఆంజనేయులుగారు పట్టుకొచ్చి ఇచ్చారా?

కాంత : లేదండీ...

కుటుం : నేను చెప్పానుగా ఆ వేళ లేదంటే పోయేది...అబ్బాయిని పంపి తెప్పించుకోడం తెలియదాయె. సరుకు గడప దాటితే ఏట్లో కలిసినట్లే.. (విసురుగా బయటికొస్తాడు)

కుటుంబ : ఆలస్యమయింది కృష్ణమూర్తిగారూ. మరేమీ అనుకోకండి...ఆ ఏమిటి సెలవివ్వండి.

కృష్ణ : ఊరు కెళ్తున్నామండి. దొంగల భయం ఎక్కువగా వుందాయె...మీరు బహు జాగ్రత్తగల మనుష్యులు...ఆ పది వేలు నగదు.. ఆ నగలు భద్రంగా మీ దగ్గరవుంచి వెళ్దామని...

కుటుంబ : ఎంతమాట సెలవిచ్చారు? అన్ని వేలు నాదగ్గరమాత్రం...

కృష్ణ : నేను మరెవ్వరి దగ్గరికీ వెళ్ళను సుమండీ... మీరంటే తెలిసినవారని, నెమ్మదస్తులని, నమ్మకస్తులని కదండీ... మాకేముంది వ్యాపారం చెప్పండి. ఆ భూములమీద వచ్చే ఆదాయం తప్ప .. ఏదో మీ పుణ్యమా అంటూ హాయిగా గడిచిపోతోంది...

కుటుంబ : హ్హి హ్హి.. చిన్నప్పటినుంచి స్నేహితులం. ఒక వీధిలో వుంటున్నాం. ఆమాత్రం సహాయంగా లేకపోతే ఎట్లాగ లెండి...హ్హి హ్హి. సరే మీ ఇష్టం...

కృష్ణ : సాయంత్రంబండికి వెళ్తానండి...ఇవిగో జాగ్రత్తగా వుంచండి... మాకు మీకంటె ఎవరున్నారు చెప్పండి...

కుటుం : హ్హి హ్హి జానుకదండీ మరి. జాబితా రాసుకోనివ్వండి. సొమ్ముతో పని కదండి...పీకలు పోయినా లక్ష్మి విషయంలో...ఆ నోట్లు అవీ చూడనివ్వండి. ఇదంతా శ్రమ సుమండీ నాకు. మీరు ఎప్పుడొచ్చినా అణా పైసలతో అప్పజెప్పాలి చూడండి మరి...

కృష్ణ : ఆ వెళ్ళివస్తానండి...కొంచెం అర్జంటు పనుంది...(వెళ్తాడు)

కాంత : అదేమిటండీ. మీరే డబ్బు ఇవ్వాలన్నాడు...

కుటుంబ : వెర్రిబాగులవాడు...ఏదో తాతలు సంపాదించిపోయారు వందఎకరాలు...అలాగనక ఇంకేముంటాడు...బుర్ర వుంటేగా...

కాంత : మనిషి వున్నారో లేదో అంత తేలిగ్గా చెప్పివేస్తాం కాబోలు. నేనే ఇవ్వాలంటే, కూర్చోండని చెప్పేదాన్ని.

కుటుం : ఆ వీధితలుపులు భద్రంగా వేసిరా...ప్చ్. రహస్యం. చివరికి నీ పుట్టింటివాళ్లకుకూడా చెప్పకూడదుసుమా. ఈ వేళ రాత్రి దొంగలు పడ్డారని గట్టిగా అరుద్దాం. ఈ సొమ్మూ, మన నగలూ, ఏభై వేల కేష్ దొంగలొచ్చి ఎత్తుకుపోయారందాం...నీవు నిజంగా ఏడ్చివేయ్... నెత్తీ నోరూ బాదుకోవాలి...

కాంత : అదేమిటండీ...

కుటుం : ఇదివరకు చెప్పలేదేమిటే... బ్రతికివుంటే బాకీ పోదని...ఈ కృష్ణమూర్తి ఇదివరకు వందరూపాయలు పట్టుకొనివెళ్ళి మూడు సంవత్సరాలైనా, నోటు తిరగరాసి ఇమ్మంటే కొట్టొచ్చాడుకదటే. ఇప్పుడు పిట్ట దొరికింది. కండబలం వుందని అప్పుడు ఎగిరెగిరిపడి బాకీ ఎగ్గొట్టాడు... నే నెవర్నో తెలుసా? కుటుంబరావుని... మెల్లిగా, మెత్తగా, మంచిగా...దూస్తావుగా నా నాటకం.. ఇలా వూరుకుంటే కొంప దివాలా తీయవలసిందే...

కాంత : ఊరుకుంటాడండీ?

కుటుం : కోమటి కాళ్ళు తేలేసి, "బాబు బాబు" అంటే ఎవరికి గుండెలు కరగవే? నే చెప్తాగా.. మరి ఎలా గనుకన్నావ్ డబ్బు సంపాదన? మా నాన్న ఎలా సంపాదించాడో తెలుసా?

కాంత : సరేగాని ఎలా వచ్చారు దొంగలంటే?

కుటుంబ : పిచ్చిదానా! పైగా పోలీసు కేసు అయితే, దొరికి ఏడుస్తుందేమిటని, ఊరుకుంటాం గప్ చిప్‌గా. అడిగిన వాళ్ళకందరికీ "దివాలా" తీశామని తెలిసిపోతుంది...అంతే...ఇంత చమటోడ్చి ఎవరికోసమే...వెర్రిదానా! అబ్బాయికి చెప్పకుసుమీ... డబ్బు సంపాదించడం ఒక ఎత్తు, ఖర్చుపెట్టడం ఒక ఎత్తు...

కాం : అమ్మో...

కుటుంబ. ఛీ...అంత భయమైతే కోమటి బ్రతికినట్టే.. గుండె ధైర్యం చేసుకో...అబ్బాయిని మేనమామగారింటికి రాజమండ్రి పంపేద్దాం. చదువుకుంటూ డక్కడ...ఉక్కబోసి వేస్తోంది... విసనకర్ర పట్టుకొనిరా...

కాంత : ఇదుగోనండీ...

కుటుం : ఇలా చించేసిందెవరే...ఇలాగైతే దివాలా తీయవలసిందే...ఎన్ని విసనకర్రలో!...పాడుపులేదేమిటే...

కాంత: దివాలా! దివాలా!! (గింజుకుంటూ లోనికి వెళ్లిపోతుంది.) ★

# రసాభాసం

సాయంకాలపు చల్లగాలిలో తిరిగి వచ్చి అప్పుడే కాళ్లు మొహం కడుక్కుని టేబిలువద్ద కూర్చున్నాను. చిందరవందరగా పడివున్న పుస్తకాలల్లో జంధ్యాలవారి పుస్తకం చేతికి దొరికింది. చదవడం మొదలెట్టాను.

"అది రమణీయ పుష్పవన
మావన మందొక మేడ,
మేడపైని నదియొక మారుమూలగది
ఆగదితల్పులు తీసి
మెల్లగా పదునయిదేండ్ల
యీడుగల బాలిక, పోలిక
రాచపిల్ల, జంకొదవెడి కాళ్ళతోడ
దిగుచున్నది క్రిందికి మెట్లుమీదు
గన్."

హోయి.. హోయి.. కమ్మని కవిత్వం... ద్రాక్షాపాకం.

"కన్నియలాగె వాలకము
కన్పడుచున్నది...కాదు కాదు
ఆ చిన్ని గులాబిలేత
అరచేతులలో..."

"యేమిటో ప్రణయగానం - వయస్సు పైనబడ్డకొద్ది చాలా బాగా తయారవుతున్నారే" అని అంతరాయం కలిగించింది మా కనకం మరో ప్రపంచంలోవున్న నాకు. "ఈ శృంగారం వదిలి యే భాగవతమో రామాయణమో చదువుకో గూడదూ?" యెంతసేపూ ఈ ఆడవాళ్ళ వర్ణనలేనా.

"ఇది శృంగారంకాదు కనకం. పిల్లలు గలవారి హృదయాన్ని ద్రవింపచేసే ఓ ఘట్టం. చూడు పాపం ఆ కుంతీదేవి.

దొరలు నానందబాష్పాలో,
దుఃఖబాష్పములో గాని
యవి గుర్తుబట్టలేము,
రాలుచున్నవి ఆమె నేత్రాల
నుండి, బాలుకుని ముద్దు
చెక్కిళ్ళమీద."

ఆహాహా...ఆహాహా...

"అయ్యో! అదేమిటండీ కళ్ళు తేలగిల వేస్తున్నారేం?" అంది కనకం.

"చూడు కనకం! ఆ కుంతీకుమారి ఆ కసికందును..."

"సరి ఈ వైరాగ్యం, వ్యాఖ్యానాలకేం గాని, భోజనం చేతురు లేవండి" అంది కనకం.

"వెధవభోజనం వుందువూ కనకం! యెప్పుడూ తిండి యావేనా!" అన్నాను నేను.

"నాన్నగూ. నాకు ఆకలేస్తోంది. లేవండి భోంచేద్దాం" అన్నాడు కుమార్.

"సరే పద" అంటూ కుర్చీ మీదనుంచి తువ్వాలు తీసి భుజంమీద వేసుకున్నా. గోడ గడియారపు ముండ్లు యెనిమిదిగంటల నలువది నిమిషాలు చూపిస్తున్నాయి.

"అంటే యిరువయి నిమిషాల ముందుగానే తింటున్నామన్న మాట యివ్వాళ్ళ" అన్నాను నేను.

"అవును" అని అందుకుంది కనకం, "కాని మన భోజనం యెప్పుడూ ఆకలినిబట్టి వుండాలి కాని గడియారపు ముండ్లనుబట్టి వుండగూడదు" అంటూ గర్వంగా నా మొహం చూచింది.

"నాన్నారూ! గడియారం ఆగినట్టుంది" అన్నాడు కుమార్.

"వధవ గడియారం. యెప్పుడూ ఇంతే" అని రిమార్కు చేసింది కనకం.

"ఓ రిస్టువాచి కొనుక్కోకూడదూ నాన్నారూ మీరు?" అన్నాడు కుమార్.

"నాకెందుకయ్యా వాచి? యింట్లో టైంపీసులో తొమ్మిదన్నరయితే ఆఫీసు తోవ, ఆఫీసు గడియారంలో నాలుగున్నరైతే యింటితోవ. ఈమధ్య యెన్నిగంటలైతే యెవరికి కావాలి; కాకపోతే యెవరికి కావాలి?" అన్నాను నేను. "అయినా యే వందో రెండువందలో కావాలి. యెందుకొచ్చినట్టు ఈ రోజుల్లో. యేదైనా మంచివిషయంలో ఖర్చుచేసినా బావుంటుంది."

"అయితే నాన్నారూ! నాకో బైసికిలు కొనిపెట్టండి. స్కూలుకు నడువలేకుండా వున్నాను" అన్నాడు కుమార్.

"అప్పుడే యేం బైసిక్కిలయ్యా - చిన్నతనం. ముక్కుపచ్చలన్నా ఆరలేదు. పట్టుమని పదేళ్ళు లేవు యిప్పటినుంచీ సైకిలుతొక్కితే ఆ కాస్తా పనికిరాకుండా అయిపోతావు" అన్నాను నేను.

కనకం కూర్చుంది. "పోనియ్యండి. బైసిక్కిలూ వద్దు. మీకు వాచి వద్దు. నాకు రెండు శిల్కుచీరలు కొనిపెట్టండి" అంటూ నవ్వు మొహం పెట్టింది.

వ్యవహారం పొత్తులో పడిపోయింది. ఉపాయంగా తప్పించుకోవడానికి ప్రయత్నించాను. బుర్రలో ఓ ఉపాయం దొర్లింది.

"మన ముగ్గురికి అవసరమయ్యేది, అందరికీ సంతోషంగావుండేది తెచ్చుకుందాం. యే తగువు వుండదు. అవునా కనకం?" అన్నాను నేను.

"అవును నాన్నారూ! అవును" అన్నాడు కుమార్, చేటంత మొహం చేసుకుని. కుర్చీలోంచి దిగి చంకలు కొడ్తూ, నాలుగుసార్లు యెగిరి, దుమికి, మళ్ళీ కూర్చున్నాడు.

కనకం మొహంగూడా వికసించింది. "అయినా మన ముగ్గురికీ ఉపయోగమయ్యేది యేముంటుందండీ—వుందండి చెప్తాను. చెప్పమన్నారా? చెప్తే తప్పకుండా తెస్తారా?" అంది కనకం.

"తప్పకుండా తెస్తాను, చెప్పచూద్దాం" అని హామీ యిచ్చాను గంభీరంగా బల్లగుద్దుతూ.

"వనక్కిపోతే నామీద ఒట్టు...మీకు యెన్నోసార్లు గూడా చెప్పాను. నీళ్లు కాచుకోవడానికి ఓ కప్పెర కావాలండీ. మంటికుండలో నీళ్లు కాచలేక చస్తున్నాను. అందరికీ వేడినీళ్లు దొరుకుతాయి హాయిగా" అని ముగించింది తను అడిగిన వరాన్ని కనకం.

"వద్దు నాన్నారూ! వద్దు. వెధవ కప్పెర - వద్దు...రేడియో తెచ్చుకుందాం. హాయిగా రోజూ పాటలు, వార్తలు, ఉపన్యాసాలు వినొచ్చు" అన్నాడు కుమార్.

"బాగా చెప్పావు కుమార్. వయస్సులో చిన్నవాడివైతే మాత్రం యేమి? బుద్ధికి బృహస్పతివి. చూశావా కనకం. వాడి బుద్ధి యెలాగ వికసించిందో! నీ బుర్ర ఆ మాత్రం పనిచేసిందా చెప్పు, వంటింటి పొగలో బూజుపట్టిన నీ బుర్ర యింకేం పనిచేస్తుంది" అన్నాను నేను దీర్ఘంగా

శ్రీ ధరణికోట శ్రీనివాసులు

న్యాసవదుల్తూ యెదో పరిశోధించి ఓ నిర్ణయానికి వచ్చినట్టు.

కౌటుకకళ్లతో మిల మిల లాడుతూ వున్న మా కనకం మొహం ఆ పాటున్నే కళలు తప్పడం మొదలెట్టింది. కుర్చీలోంచి లేచిపోతూ "కాదుమరీ, వున్నదివున్నట్టు అంటె! యింట్లో సరిగ్గా సామానులు లేవు గాని రేడియోలు తెచ్చుకుంటారట... యెవ్వరయినా వింటే నవ్విపోతారు. తిండి తిండి తిందురుగాని.. కుమార్! లేవక యింకా కూర్చున్నావేం పోతులాగ. లేచి కాళ్లు చేతులు కడుక్కో... వెధవ వుపన్యాసాలూను నీవూను." అంటూ వురిమి చూచింది కనకం, కొడుకుని.

"వుపన్యాసా లేమిటమ్మా నీ చాదస్తం కాకపోతే! "ప్రపంచమంతా ముందుకు నడుస్తూవుంటే నీవు వెనక్కిపోతున్నావే మమ్మా యింకా, పాతకాలపు మనిషివి కాకపోతే..."

కనకం తాచుపాములాగు లేచింది. "వెధవాయి. జానెడు లేవు, నీవూ చెప్పే వాడివేనా నాకు?" అంది.

ఫెళ్లుమని చప్పుడయింది. వెనక్కి తిరిగి దిగులుగా చూచా. కుమార్ చెంపపై చెయి నిమురుకుంటున్నాడు. వాడి కళ్ళలోంచి నీటిచుక్కలు రాలుతున్నాయి.

"ఏమిటా దుడుకుతనం, కనకం వాణ్ణి అన్యాయంగా కొట్టావు?" అని గద్దించాను.

"మహ బాగా చెప్పారులెండి. ఈ వెధవాయికూడా నన్ను అనేవాడయినాడండీ. అసలు ఈ యింట్లో నేనొక్కర్తె నేనా అనాగరీకురాల్ని...అంతా హేళన చేసేవాళ్ళేనా" అంటూ కంట నీరు పెట్టుకుంది కనకం.

'నీవేది చేసినా ఒప్పుకుంటా కాని పిల్లణ్ణికొడ్తే మాత్రం ఒప్పుకోను సుమా" అన్నాను నేను.

"యిలాగా అని అని వాణ్ణి యింతవాణ్ణి చేశారు. అసలు వాడు పాడవుతున్నాడంటె మీవల్లనే, తెలిసిందా!" అంది కనకం.

"కాదు కనకం, వాడు పాడయినాడనే నీవు అంటే, నీవల్ల అయినాడనేఅంటాను. నేను వాణ్ణి యెప్పుడు మందలించినా వెనుకేసుకొచ్చి వాడితరఫున వాదించేదానివి గదూ. నీ పాఠం నీకే వొప్పచెప్పుతున్నాడు. తప్పేముంది?" అన్నాను.

"అవును. నేను యేది చేసినా ఓ తప్పు అవుతుంది. దానికి యేదో అతీతంగా కల్పించి కొండంతచేసి చెప్పుతారు. నా ఖర్మం అలాగుంది" అని కన్నీరొత్తుకుంటూ కూర్చుంది కనకం.

ఇహ చాలులెండి సరసాలు; అన్నట్టుగా నన్ను నామంచం ఆహ్వానించింది. మంచంమీద మేనువాల్చి ముసుగు పెట్టాను.

చలిగాలి హోరున వీస్తోంది. కనకం సన్నగా వెక్కివెక్కి యేడుస్తూవున్న కిసుక్కులు అప్పుడప్పుడు గాలితెరలు నా చెవులకు తీసుకొస్తున్నాయి...కునుకుపట్టూవుంది.

"మా నాయనకదూ! కాస్త అన్నం తిందువు లే. కమ్మటి పెరుగు వేస్తాను. యింట్లో యెవరికి కోపమొచ్చినా నీ మీదినుండే పోతుంది." అనే కనకంమాటలు వినబడ్తున్నాయి. యేడుపుస్వరంగూడా హెచ్చుస్థాయికి వస్తూవుంది.

ముసుగుతీసి చూశాను. కొడుకు మంచంమీద కూర్చొని కనకం వాడితల నిమురుతూ బత్తిమాలుతూవుంది.

మళ్ళీ ముసుగు పెట్టాను. అప్పటి పద్యం బుర్రలో మళ్ళీ దొర్లింది.

"దొరలు నానందబాష్పాలో దుఃఖబాష్పములో గాని.... రాలుచున్నవి.....బాలకుని ముద్దుచెక్కిళ్ళమీద.'

అని గట్టిగా ముసుగులోనే మూలిగాను.

"చాలెండి కవిత్వం, కయ్యంవరకు తెచ్చింది... లేచి కాళ్లు కడుక్కుందురూ. వడ్డిస్తాను" అంటూ వంటింట్లోకి నడిచింది కనకం. ★



# ఆహుతి

నాన్న మంచంపట్టాడు. ఆయాసం ఎక్కువైంది. మధ్య మధ్య దగ్గుతూ అమితంగా బాధపడుతున్నాడు. రోజూ సాయంత్రానికల్లా వచ్చే అన్నయ్య ఎందుచేతో ఇంతవరకు యింటికి రాలేదు. చిట్టి వచ్చి "అక్కాయ్! నాన్నకు జబ్బు తగ్గుతుందా?" అని జాలిగా అడిగింది. నాకు ఏడుపు పర్యంతం వచ్చింది. చిట్టి మొహంలో విచారంతో కూడిన జాలి కనపడింది. యింత చిన్నవయస్సులో చిట్టి మొహంలో విచారం చూడవలసివచ్చింది. పిల్లలు బెంగపెట్టుకొంటే చిక్కిపోతారు. పెద్దదాన్ని నేనే సముదాయించాలి. "ఎబ్బే! ఏంలేదు. రేపీపాటికి నాన్న మనందర్నీ షికారుకు తీసుకువెళతారు. అన్నం తిని నువ్వెళ్ళి ఆడుకో" అని చిట్టిని సముదాయించాను. "నువ్వీమాట పదిరోజుల్నుంచి చెబుతున్నావక్కాయ్!" అంది జాలిగా. "నాన్నకు రేపే జ్వరం తగ్గుతుందిగా! నేనూ నాన్నా రేపే అన్నం తింటాంలే" అంటూ అక్కడే నిలబడింది చిట్టి.

నాన్న జబ్బు రోజురోజూ ఎక్కువౌతోందేకాని ఏ తగ్గే సూచనలు కనబడటంలేదు. చిట్టి తల నొకసారి నిమిరి "రాచిట్టీ! రా! నాన్నకు జ్వరం తగ్గుతుందిలే. వెంకుగాడిని కూడా పిల్చుకురా. అన్నం తిందురుగాని" అన్నాను. ఇంతట్లోకే వెంకు చిరిగిన చొక్కాతో, రేగినతలతో, ముక్కు ఎగదోసుకుంటూవచ్చి "చూడవే అక్కా! వాళ్ళరామం నన్ను ఉత్త పుణ్యానికి కొట్టాడే." అంటూ కళ్ళు నలుపుకుంటూ, ఏడుస్తూ వెళ్తున్న రామాన్ని చూపించాడు. పన్నెండేళ్ళ వెధవని ఎనిమిదేళ్ళరాముం కొట్టాడంటే ఎలా నమ్మను? అసలు వెంకు ఆటలకువెళ్తే రోజూ ఎవళ్ళతోటో ఒక్కళ్ళతో దెబ్బలాట తెచ్చుకోందే యింటికి రాడు. చిన్నపిల్లలు. యింటిపరిస్థితులు వాళ్ళకే మర్థమవుతాయి. "నాన్నకు జ్వరంగా ఉంది. గట్టిగా కేకలు వేయకు." అన్నాను. నాన్న విషయం గుర్తుకొచ్చేసరికి రామం గబగబా నాన్నదగ్గరికి పరిగెత్తుకెళ్లాడు. నాన్నకు జ్వరం వచ్చిన దగ్గరనుంచి చిట్టి ఆడుకోనేందుకు యిల్లు కదలటంలేదు. ఇంట్లోనేఉండి నాన్నకు

భూషణ్

మంచినీళ్ళు మందు అందిస్తూఉండేది. వెంకుమాత్రం బయటకువెళ్తే యిల్లువిషయం మరచిపోతాడు. నాన్నకు జ్వరంగాఉన్నా యింట్లో అప్పుడప్పుడు వెంకు అల్లరిచేస్తూనే ఉంటాడు. "అన్నాయ్! నాన్నకు జ్వరంగాఉంది. అల్లరి చేయకూడదు." అని వెంకును మందలించేది చిట్టి. వయస్సులో చిన్నదైనా, నాన్నకి జ్వరంగాఉంది కాబట్టి సరిపోయిందిగాని యిటువంటి పెద్దరికంమాటలు యింకెప్పుడైనా చిట్టి నోటినుంచి వస్తే నాలుగు కొట్టి తన పెద్దరికం వెలగబెట్టుకొని యింట్లోంచి వెళ్ళిపోయేవాడే వెంకు.

*   *   *   *

అమ్మపోయి ఆరేళ్ళయింది. పగలల్లా ఆఫీసులో పనిచేసే ఏవో నాలుగుడబ్బులు సంపాదించే నాన్న మంచం పట్టాడు. నాన్న ... స్తాగా పనిచే ... రాలు ప్రభుత్వానికి తన శక్తివంచన లేకుండా సేవచేశాడు. నాన్న ఏ రోజూ సాయంత్రం ఆరుగంటలకు రాగా చూడలేదు. పొద్దున ఎనిమిదిగంటలకు ఆఫీసుకు వెళ్ళి రాత్రి ఎనిమిదింటికి యింటికి తిరిగి వచ్చేవాడు. మధ్యాహ్నం పదకొండు గంటలకు భోజనానికి తప్ప ఆయన ఇంటికి వచ్చేవాడే కాదు. అన్నయ్య చదువుకోసం, మా సుఖంకోసం నాన్న తన సుఖాన్ని, ఆరోగ్యాన్ని మరచిపోయేవాడు. అన్నయ్య కాలేజీలో ఉండగా నాలుగుజతల లాబలూ చొక్కాలూ కొనిపంపాడు. తనుమాత్రం బుజాలు చిరిగిన చొక్కామీద మోచేతులు పికిలిన పాతకోటు వేసుకొని ఆఫీసుకు వెళ్ళేవాడు.

నాన్న అన్నిటికంటె నా విషయమై బెంగపెట్టుకొనేవాడు. "వయసు ఎదిగిన పిల్లను ఎంతకాలం యింట్లో పెట్టుకుంటావు?" అని తన బంధువులు' స్నేహితులు నాన్నని అడిగేవారట. నాన్నకు నా వివాహం చేయలేదనే విచారంకన్న అందరూ తనని వేలెత్తి చూపుతున్నారని అమితంగా బాధకలిగేది. నాన్నమాత్రం ఊరికే కూర్చోలేదుగా. అవకాశమున్నప్పుడల్లా తనకు తెలిసిన సంబంధాలకోసం కాళ్ళరిగిపొయ్యేటట్లు తిరిగేవాడు. ఆడపిల్ల వివాహమంటే వేలతో వ్యవహారం. తాతయ్య యిచ్చిన ఆస్థి నాలుగెకరాలూ యింతవరకు యీ యిల్లు గడవటానికే సరిపోయింది. అన్నయ్యను కొస్త పెద్దచదువు చదివించాలని తను నిత్యం కష్టపడి యింతవరకూ సాగిస్తూవచ్చాడు. నాకు 14 వ ఏడు వచ్చిం దగ్గరనుంచీ నాన్న నా వివాహప్రయత్నం చేస్తూనే ఉన్నాడు. పెళ్ళి చూపులకనివచ్చిన వాళ్ళ మర్యాదలకే యీ నాలుగేళ్ళలోను ఒక ఎకరం అమ్మవలసివచ్చింది. "అంతా చూసి వెళ్ళి "పిల్లనచ్చింది. డబ్బు విషయంలో మావాళ్ళు నాలుగువేలకి తక్కువయితే ఒప్పుకోనంటున్నారు" అని ఒక కార్డు వ్రాసేవాళ్లు. నాలుగువేలు! కనీసం నాలుగువందలైనా కట్నంరూపంలో యిచ్చుకోలేని పరిస్థితుల్లో నాలుగువేలు ఎక్కడినుంచి తీసుకవస్తాం? మా జీవితాలని శాశ్వత బానిసత్వానికి అంకితం చేయడానికి నిశ్చయించుకొన్నా నాలుగువేలు రావు. "నాన్నా! నా పెళ్ళివిషయంలో మీరు మీ ఆరోగ్యాన్ని అనవసరంగా చెడకొట్టుకుంటున్నారు. అయినప్పుడు అవుతుందిలే. మీరేమీ చింతపెట్టుకోకండి" అన్నాను. "అంతేనమ్మా. అంతేలే. ఎంత ప్రయత్నిస్తే ఏం లాభం? ఘటన వచ్చినప్పుడే

" కొంటే నువ్వు నా రెండో కొడుకు వనుకుంటాను. ఇంత వరకు నీకు చదువులేకుండా చేశాను. నీ వివాహప్రయత్నాలకు ఖర్చు పెట్టిన డబ్బుతో నీవీ పాటికి అన్నయ్యతో సమానంగా చదువుతూ ఉండేదానివి" అన్నారు. ఆ మాటలో ఆవేశం ఉంది. ప్రపంచం మీదే తనకు అసహ్యం కలిగినట్లుగా మాట్లాడారు.

అన్నయ్య కాలేజీలో చదువుకొనే రోజుల్లో నాకు ఉత్తరాలు రాస్తూండేవాడు. అమ్మలేని మమ్మల్ని అన్నయ్య ఎంతో ఆదరంగా చూస్తూండేవాడు. "మనం నివసించేది ఒక మురికి కూపంలో. మన చుట్టూ ఉన్న సమాజం మనల్ని పరిహసిస్తుంది. దానికి మన పరిస్థితులతో సంబంధం లేదు. తన్న యినప పాదాల క్రింద అనేక మంది అమాయిక జీవులను నలిపివేసింది. దాని అడుపాజ్ఞల్లో నడిచే స్తోమతు మన కెవ్వరికీ లేదు. అల్లా నడవనివాళ్ళని నానా హింసలు పెడుతుంది. అది దాని కర్కశ స్వభావం. అది మనల్ని వెక్కిరిస్తుంది. మన సమాధులను చూచిగాని సంతృప్తిజెంది వికటంగా నవ్వదు" అంటూ ఏవో వ్రాసేవాడు. మరీ కొత్తల్లో ఆ మాటలు నా కర్థమయ్యేవి కావు. అన్నయ్య శెలవలకు వచ్చినపుడు నేనూ అన్నయ్యా కాలవగట్టుకు షికారుకు వెళ్లేవాళ్ళం. ఎన్నెన్నో అనుభవాలు, చుట్టూ ఉండే వ్యక్తుల మనస్తత్వాలు, సమాజపు పరిస్థితులు నాకు చెప్పేవాడు. నిజానికి అన్నయ్య చెప్తూన్న ప్రతి విషయాన్ని మా పరిస్థితులకు అన్వయించుకొనేదాన్ని. ప్రపంచం అంటే ఏమిటో నాకు అన్నయ్య కళ్ళకు కట్టినట్టు చూపించాడు. అన్నయ్య అందరిలాగా ఉండడు. అన్నయ్యలో ఒక ప్రత్యేకత ఉంది. అన్నయ్యలో ఏవో నిగూఢంగా దాగిఉన్న భావాలూ, వాటిని సాధించాలనే తీరని వాంఛా కనబడుతూ ఉండేవి. అన్నయ్య తన వయసులో ఉండే ఏ కాలేజీ స్టూడెంటులా ఏ వ్యక్తినీ గేలిచేయడు. కనీసం ఆటలకైనా వెళ్ళేవాడు కాదు. ఎప్పుడూ ఏదో పుస్తకాలు చదువుతూ ఉంటాడు నాన్న. అన్నయ్య యింటికి వచ్చినప్పుడల్లా నాన్నతో ఏవేవో విషయాలు చర్చిస్తూ ఉండేవాడు. అన్నయ్య చెప్పినవల్లా శ్రద్ధగా విని "నువ్వు యింకా కుర్రకుంకవు. అనుభవం లేకుండా మాట్లాడుతున్నావు. పెద్దవాడిని నేనున్నాగా నేను చూసుకొంటాలే" అని సమాధానమిచ్చి అన్నయ్యని యింక మాట్లాడకుండా చేసేవాడు.

నాన్న యింటిదగ్గరనుంచి ఎంతపంపినా అన్నయ్య మళ్ళీ డబ్బు కావాలని అడిగేవాడు కాదు. అన్నయ్యకి యింటిపరిస్థితులు తెలుసు. నాన్నమాత్రం వాడికి సరిపడ్డ డబ్బు పంపలేకపోతున్నానని బాధపడేవాడు. బాధపడిమాత్రం తను చేసేదేముంది కనుక? అన్నయ్యవద్దనుంచి డబ్బుకోసం ఏవిధమైన జవాబు రాకపోవడంచేత నాన్న కొంత తృప్తిపడేవాడు. అయినా అన్నయ్య ఎల్లా సరిపెట్టుకొంటున్నాడా అనిమాత్రం నాన్నకు సందేహం కలుగకపోలేదు. ఏదో విధంగా సమాధానపరచుకొనేవాడు. అన్నయ్య తరచు కాలేజీనుంచి నాకు పుస్తకాలు పిల్లలకి బొమ్మలూ పంపిస్తూ ఉండేవాడు. నాన్న యీ విషయం చూస్తూ చూడనట్టుగా ఊరుకొనేవాడు. అన్నయ్య మంచి మార్కులు తెచ్చుకుంటున్నాడు. అన్నయ్య చదువు విషయమై నాన్నకు ఏ సందేహమూ లేదు. అన్నయ్యను నాన్న పెద్ద చదువు చదివించాలని అనుకొన్నాడు. తనలాగా గుమాస్తాగా చేరి, అభిమానాన్ని, ఆత్మగౌరవాన్ని చంపుకొన్న వ్యక్తిలా అన్నయ్యని తయారుచేయకూడదనుకొన్నాడు. అందుకోసం తన శక్తికి మించిన పనిచేసేవాడు.

నాన్నకు పెన్షను తీసుకొనే రోజు దగ్గరపడుతోందనే ఆరాటం ఎక్కువైంది. యిప్పటి ఈ జీతంతోనే యిల్లు గడవటం కష్టంగా ఉంటే రేపటినుండి వచ్చే సగం జీతంతో రోజులెల్లా గడుస్తాయో అర్థంకాకుండా ఉంది.

అనుకొన్నంతసేపు పట్టలేదు. ఆరోజూ వచ్చింది. తను వృద్ధుడైనా తన కర్తవ్యాన్ని శ్రద్ధతో నిర్వర్తిస్తాను; తననా ఉద్యోగంలో ఉంచమని ప్రభుత్వాన్ని అర్థించాడు. నాన్న దృష్టిలో మేము, మా భావి ఆనందం మాత్రమే ఉన్నాయి. అందుకోసం తను నిరంతర శ్రమచేస్తాడు. మానవులజీవితాలపై వ్యాపారం చేసే ప్రభుత్వం నాన్న ఆశల్ని మొదలంట త్రుంచింది. ప్రభుత్వదృష్టి పెన్షన్ తీసుకొన్న ఉద్యోగస్తులకు జీతంతోపాటు శక్తి సామర్థ్యాలు, సంసారాలు తగ్గాలని కాబోలు. జీవితాలకు హామీ యివ్వలేని ప్రభుత్వాలనుండి అంతకుమించిఆశించలేం. నాన్నకి భావి అంతా శూన్యంగా గోచరించింది. మాకోసం ఆ అర్ధజీతమైనా పూడ్చడానికి ఏదైనా ఉద్యోగం చేయాలి. అందుకోసం ఊరంతాతిరిగాడు. చివరికి నాలుగు దుకాణాలలో పద్దులు వ్రాసేందుకు వప్పుకొన్నాడు.

వార్ధక్యం వచ్చిందేమో నాన్న ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిని మంచం పట్టాడు. అన్నయ్యకు డబ్బు పంపించలేక పోతున్నాడు. అయినా అన్నయ్యవద్ద నుండి డబ్బు పంపమని ఒక్క ఉత్తరం కూడా రాలేదు. నాన్నకి ఆ రోజున ఆయాసం ఎక్కువైంది. ఇంట్లో మగ దిక్కు ఎవరూ లేరు. తప్పని సరిగా అన్నయ్యను యింటికి రమ్మని జాబు వ్రాయక తప్పలేదు. అన్నయ్య పెద్ద పరీక్షలు సరిగా పదిహేనురోజులున్నాయి. అన్నయ్యకు ఏంచేయాలో తెలియలేదు. నాన్న జబ్బుతో పడిపోతే యిల్లు చూచేదెవరు? అందుకోసం అతి కష్టం మీద యింటికి వచ్చాడు. నాన్నను చూసేసరికి అన్నయ్య ఒక్కసారిగా కూలిపోయాడు. నాన్నతో ఆయాసం మార్చింది. చిక్కి శల్యమైపోయాడు.

"నాన్నా" అని ఒక్కసారి నాన్నని కౌగలించుకొన్నాడు. అన్నయ్యకూడా చిక్కి ఆనమాలు కట్టలేనంతగా మారిపోయాడు. నాన్న అన్నయ్య తలనిమిరి కళ్ళవెంబడి నీళ్లు కారుస్తూ అన్నాడు. "నీమీద ఎన్నో ఆశలు పెట్టుకొని యింత వరకు జీవితాన్ని గడుపుకువచ్చాను. నా ప్రయత్నం నేను చేశాను. కాని లాభం లేకపోయింది. కనీసం నీకు సరైన విద్య అయినా చెప్పించలేని దౌర్భాగ్యుడనయ్యాను. నువ్వునన్ను డబ్బుకోసంకూడా బాధ పెట్టలేదు. అయినా ఆ మాత్రంకూడా సహాయం చేయలేని నిర్భాగ్యుడనయ్యాను. నా నరాలు 'పనిచెయ్యము' అని అన్నంత వరకు నీకోసం, నీ చెల్లెళ్ళకోసం, నీ తమ్ముడికోసం కష్టపడ్డాను. అయినా యీనాడు కాలు కదపలేని స్థితివచ్చింది. నీ చదువు ఆఖరి రోజులలోనే యీ అవాంతరం వచ్చిపడింది. నిన్ను చదువు మాని యీ యింటి బాధ్యత తీసుకోమని చెప్పవలసివచ్చినందుకుసిగ్గుపడుతున్నాను. అయినా తప్పనిసరి అయింది. రేపటినుండీ నువ్వేదైనా ఉద్యోగంలో ప్రవేశించి నీ చెల్లెళ్ళని తమ్ముళ్లని పోషించాలసి ఉంటుంది." అని ఒక నిట్టూర్పు విడిచాడు. అన్నయ్యముఖం గంభీర మయింది.

ఉద్యోగంకోసం అన్నయ్య కాలుగాలిన పిల్లిలా ఊరంతా తిరిగాడు. తను ఇంటర్ ప్యాసయానన్నాడు. గుమాస్తాగాకూడా పనిచేస్తానన్నాడు. ఈ నిరుద్యోగపు రోజుల్లో ఉద్యోగా లెక్కడ దొరుకుతాయి? తనకంటే ఎక్కువ చదివినవాళ్లు, ఊహించలేని నికృష్టజీవితం గడుపుతున్నారు. S. S. L. C క్వాలిఫికేషన్ చాలునన్న ఉద్యోగాలకు ఎం. ఏ. లు బి. ఏ. లు ఒకరిమీద ఒకరు పోటీగా వస్తున్న యీ రోజులలో బి. యే. మొదటి సంవత్సరం చదువుతూ మానేసిన అన్నయ్యకు ఉద్యోగం దొరకమంటె ఎల్లా దొరుకుతుంది? అన్నయ్య, అన్నయ్యలోని ప్రతిభ కాదు వాళ్ళకి కావలసింది. కూడికలు కూడ గలిగిన, రెండు కాళ్ళూ, రెండు చేతులూ గల ఏ తోలు యంత్రమైనా సరే తక్కువ ఖరీదులో పనిచెయ్యాలి. అంతే. అన్నయ్య ఉద్యోగంకోసం తిరిగి విసిగెత్తిపోయాడు. జీవితాన్ని చవిచూడనియ్యని యీ మురికి ఉద్యోగా చేయకూడదనుకొన్నాడు. కాని నాకోసం, నాన్నకోసం, చిట్టికోసం, వెంకుకోసం అన్నయ్య ఏ ఉద్యోగమైనా చేయాలి. తప్పదు.

అన్నయ్య ప్రోత్సాహంపైన యింగ్లీషు, హిందీ యింటివద్దనే నేర్చుకొన్నా. నేను కూడాఏవైనా ట్యూషన్లు చెప్పి ఇల్లు గడవటానికి కొంత సాయపడదామనుకొన్నా. కాని నాన్న అడ్డుపెట్టాడు. "మనవంశంలో ఆడవాళ్ళు గుమ్మందాటి ఎరగరు. నువ్వు నా వంశగౌరవం నిలబెట్టాలి. వంశ మర్యాదకోసం అవసరమైతే అర్థాకలితోనైనా బతుకుదాం కాని నీవు గడపదాటడానికి వీలులేదు" అని శాసించారు. యిటువంటి విషయాలపైనే నాన్నకి అన్నయ్యకి మునుపల్లా అభిప్రాయభేదాలు వచ్చేవి. "అర్ధాకలితో మనుష్యులను చావనిచ్చే వంశగౌరవం మన కక్కరలేదు. అయినా పరిస్థితులు మారాయి. తాతయ్యాతత

...ఎకరాలు ఉండేవి. వాళ్ళు మనలా తిండికోసం ఉద్యోగాలు చేయలేదు. బతుకుకోసం చదువులు చదవలేదు. కాబట్టి వాళ్ళ ఆడవాళ్ళు యిల్లు కదలవలసిన అవసరం లేకపోయింది. అందుకనే వాళ్లు వంశమర్యాదని బంగారపు పెట్టెలో పెట్టి దించేవాళ్లు. నీవరకూ వచ్చేసరికి ఏమీ మిగలలేదు. వంశమర్యాదలకోసం జీవితాలను ఆహుతి చేయడం ఏమంత తెలివైన పని" అని అన్నయ్య అందుకొనేవాడు. అన్నయ్య నిజమే చెప్పాడు. కాని నాన్న వాడి మాటలు లెక్క చేసేవాడు కాదు. తను యీ యింటికి పెద్ద. తనమాట చెల్లాలి అనేవాడు. జబ్బుతో ఉన్న నాన్నతో వివాదం పెట్టుకొని అనవసరంగా ఆయన మనసు నొప్పించడం యిష్టం లేక అన్నయ్య

ఉద్యోగం దొరకలేదు. ఏం చేయాలో తోచలేదు. ఇంతలోనే చిట్టి "అక్కాయ్! ఆకలేస్తోంది అన్నం పెట్టవ్!" అంటూ వచ్చింది. ఆ మాట అన్నయ్యను కలతపెట్టింది. తను ఉద్యోగం లేకుండా కూర్చుంటే తన చిట్టి చెల్లెలు "అన్నాయ్! ఆకలేస్తోంది. తినేందుకేదైనా కొంచెం పెట్టవూ?" అని జాలిగా ఊపిరిలేని చూపులతో తనని అడిగినట్లనిపించింది. అన్నయ్య ఒక్కసారిగా అదిరిపడ్డాడు. "తన చెల్లెళ్లు ఆకలితో అహుతవడానికి వీలులేదు. నా శరీరంలో ప్రాణముండగా నా చిట్టి చెల్లెళ్ళనీ, తమ్ముడినీ ఆకలితో చావనీను" అనుకున్నాడు. చిట్టిని ఎత్తుకొని ముద్దుపెట్టుకొని తన జేబులో ఉన్న కానీ యిచ్చాడు.

మళ్లీ బయలుదేరాడు ఉద్యోగంకోసం సాయంత్రం యింటికొచ్చి నాన్నతో అన్నాడు. "నాన్నా! తాలూకా ఆఫీసులో గుమాస్తాఉద్యోగం ఖాళీ ఉందట. టెంపరరీ ఉద్యోగమట. అదైనా హెడ్ గుమాస్తాగారబ్బాయిని కాబట్టి యిస్తామన్నారు నా చదువుని బట్టికాదుట. కారణం అదే గుమాస్తాపనికి *M. A.* పాసయిన నిరుద్యోగికూడా అప్లికేషను పెట్టాట్ట. రేపటినుండే డ్యూటీలో జాయిన్ అవుతాను" అని అన్నయ్య చెప్పేసరికి ఆనందించవలసిన నాన్న ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ ఉండిపోయాడు. ముప్ఫయి సంవత్సరాలకు పూర్వం తాను ఈ ఉద్యోగంలో ప్రవేశించి రాత్రి పగలు కష్టించినా ఏ మెప్పూ లేకపోగా అధికార్ల చీవాట్లకు లోనైన దృశ్యం కళ్లకుకట్టింది. గుమాస్తాలు మనుష్యులు కాదనేభావంతో పై అధికారులు, ప్రవర్తిస్తారు. వాళ్ళకి వ్యక్తిత్వం ఉందనే విషయాన్ని మరచిపోతారు. ఎవరైనా ఆత్మ గౌరవానికి పెనుగులాడారా అంటే అంతటితో వాళ్ల ఉద్యోగానికి స్వస్తి చెప్పబడుతుంది. మొదట్లో ఆ తిట్లు యీసడింపులు తన మనస్సును చాల బాధపెట్టేవి. వెధవ ఉద్యోగం చేయకపోతేనేం అనుకొనేవాడు. కాని అమ్మకోసం, మా కోసం ఉద్యోగాన్ని చేయవలసివచ్చేది. అందుచేత ఎన్ని తిట్లైనా భరించేవాడు. ఆ తిట్లు నిత్యం ఉంటూ ఉండేవే కనుక, తిట్టినా ఏమీ చలించనట్లుగా తయారయింది నాన్న హృదయం.

నాన్న కళ్లమ్మట నీళ్లుతిరిగాయి, తన గుమాస్తాజీవితపు అనుభవాలన్ని జ్ఞప్తికి వచ్చేసరికి. "ఏమిటి నాన్నా ఆలోచిస్తున్నారు" అన్నాడు అన్నయ్య. కళ్లల్లో నీళ్ళు కళ్ళల్లోనే యింకించుకుంటూ "బి.ఎ చదివినా నీకు కూడా యీ తాలూకా గుమాస్తా ఉద్యోగం తప్పలేదు. నీ తండ్రి నిన్ను అంతకంటె పెద్దవాడినిగా తయారుచేయలేకపోయాడు. నువ్వు మాత్రం ఉద్యోగం చేసేటప్పుడు నీకుఆత్మ ఉన్నదనే విషయాన్ని మరచిపో. లేకపోతే ఆ నాలుగురాళ్ళూ రావడం కష్టం." అన్నాడు.

"అదేమిటి నాన్నా మీకు మతిపోయిందా అవేంమాటలు. నావ్యక్తిత్వాన్ని కించపరచనిచ్చే పనులేవీ చేయనులెండి. వాళ్లు మాత్రం మనుష్యులు కారా? మనలాంటి హృదయాలే వాళ్ళకీ ఉంటాయి. అటువంటప్పుడు విభేదాలెందుకు వస్తాయి" అన్నాడు ఉద్యోగానుభవం లేని అన్నయ్య.

"అలా కాదు. ఆ హోదాలోకి వచ్చిన ప్రతివాళ్ల హృదయాలూ రాళ్ళకంటె కర్కశంగా తయారవుతాయి. వాళ్లకి ఆప్తులు సన్నిహితులు అనే వ్యత్యాసం ఉండదు. ఎప్పుడూ వాళ్లు వాళ్ళ హోదాలే తప్ప" అని అన్నయ్యను ఉద్యోగంలో చేరమని పంపాడు నాన్న.

అన్నయ్య మొదట్లో పదకొండు గంటలకి ఆఫీసుకెళ్ళేవాడు. తనతోటి గుమాస్తాలందరినీ ఒకసారి చూశాడు. ఎవరిమొహాల్లోను ఆనందం కనబడలేదు. తనని జీవంలేని చిరునవ్వులతో ఆహ్వానించారు. ఆ నవ్వులో జీవితం మీద విరక్తి కనబడేది. అంతా బతుకుతున్నారు కాబట్టి మేమూ బతుకుతున్నాం అన్నట్టుండేవారు. తన జీవితంలో ఎదో సాధిద్దామనుకొన్న అన్నయ్య వీళ్ళందర్నీ చూసేసరికి తనుకూడా యిల్లా తయారవుతానేమోనని భయపడ్డాడు. మళ్ళీ తనలో తనే సమాధానపడ్డాడు. ఏ పరిస్థితులలోనూ తను అల్లా తయారవకూడదనుకొన్నాడు. వాళ్ళకీ తనకీ కొంత వ్యత్యాసముందనుకొన్నాడు. అవకాశముంటే తను వాళ్ళందరికీ ఎల్లా జీవించాలో తెలియజెప్పాలనుకొన్నాడు. పనిలో ప్రవేశించి సరిగ్గా వారంరోజులైందో లేదో పరిస్థితులకు తాను బానిసవుతున్నట్లు గ్రహించాడు. ఆఫీసులో ఆరుగంటలు శ్రద్ధతో పనిచేసి మిగిలిన సమయంలో ఏవేవో చదవాలనుకొన్నాడు. నలుగురు గుమాస్తాలు చేయదగ్గపని తనొక్కడు చేయవలసివస్తోంది. అందుకోసం ఉదయం సాయంత్రంకూడా ఆఫీసులోనే ఉండి పనిచేసేవాడు. ఒక్కొక్కప్పుడు రాత్రుల్లుకూడా ఆఫీసుకి వెళ్ళి పనిచేసేవాడు. అయినా పని తరగటంలేదు. "యింకో గుమాస్తాను వెయ్యండి" అని అడిగాడు అన్నయ్య. "నువ్వు శ్రద్ధగా పనిచేస్తే యింకో గుమాస్తా అవసరంలేదు. యింకో గుమాస్తాను పెట్టేందుకు ప్రావిజన్ (*Provision*) లేదు" అన్నారు పై ఆఫీసరు. ఇంతకంటే శ్రద్ధగా పనిచేయడమంటే ఏమిటో అన్నయ్యకు అర్థంకాలేదు. ఇంత కష్టపడి పనిచేసినా యింకా శ్రద్ధగా పనిచెయ్యటం లేదంటే అన్నయ్య వ్యక్తిత్వానికి కొంత దెబ్బ తగిలింది. తను గుమాస్తా అన్నమాట జ్ఞప్తికి వచ్చేసరికి యింక ఏ మాటా చెప్పకుండా వచ్చేసి తనపని తను చూసుకోవడం మొదలెట్టాడు. అన్నయ్యబుర్ర వేడెక్కిపోయింది. ఏవేవో ఆలోచనలు అన్నయ్య మెదడులో మెదిలినాయి. నాన్న చెప్పిన మాటలు జ్ఞప్తికివచ్చాయి. "అరవైఏదు రూపాయల జీతంతో రాత్రి పగలు పనిచేయించుకొనేందుకు వీలుంటుంది గాని యింకో గుమాస్తాను వేసేందుకు *Provision* లేదుకాబోలు" అనిఅందామనుకొన్నాడు. అల్లా అంటే దాని పర్యవసానం ఏమవుతుందో తెలుసు. తను అనదలచుకొన్న మాటలు తన నోట్లోనే అంతరింపజేసుకొన్నాడు. పని ఎక్కువైనా పనికితగ్గ గుమాస్తాలను ప్రభుత్వం నియమించలేదు. యంత్రానికైనా కొంత విశ్రాంతి అవసరం. ఆ విశ్రాంతి లేకపోతే యంత్రాలు పాడవుతాయని యజమాని వాటికి తగు విరామం ఇస్తాడు. యంత్రం పాడయితే తను దానిపై పెట్టిన పెట్టుబడికి నష్టం వస్తుంది. మనుష్యులు యంత్రాలకన్న నికృష్టజీవులు. ఈ తోలుయంత్రాలపై ఎవరూ పెట్టుబడి పెట్టనక్కరలేదు. ఈ తోలు యంత్రాల బాగోగులతో వాళ్ళకి సంబంధం లేదు. ఈ యంత్రం మూలపడితే పెట్టుబడి అక్కరలేకుండా ఇంకో యంత్రం పోటీబడి ఆ స్థానం ఆక్రమించుకుంటుంది. మనిషి విలువ యినుపముక్కకన్న హీనం.

అన్నయ్య ఉద్యోగంలో ప్రవేశించిన దగ్గరనుంచి మాతో సరిగ్గా మాట్లాడేందుకే అవకాశం లేదు. మునపట్లా మమ్మల్ని షికారుకు తీసుకువెళ్ళటం లేదు. ఏమాత్రమవకాశమున్నా ఆఫీసుకే వెళతాడు. మునుపటి అన్నయ్యకి యివాళటి అన్నయ్యకి చాలా వ్యత్యాసం ఉంది. చిట్టి దగ్గరకు వస్తే ఎంతో ఆప్యాయంగా ముద్దు పెట్టుకొనే అన్నయ్య చిట్టి మాట్లాడితేనే విసుక్కుంటున్నాడు. బిక్కమొహం వేసుకొని చిట్టి దూరంగా పోతుంది. అన్నయ్య దగ్గరకు రావడానికే భయపడుతోంది. మళ్లీ తన తప్పు గ్రహించి చిట్టిని బుజ్జగించి పంపుతున్నాడు. ఆ బుజ్జగింపులో పూర్వపు సహజత్వం లేదు. విసుక్కోకుండా ఉండాలనుకొంటాడు. అయినా తనకు తెలియకుండానే విసుక్కోక తప్పటం లేదు. ఆఫీసులో పనిచేసి వచ్చిన అన్నయ్యకు ఏ మాట మాట్లాడినా విసుగ్గానే కనబడుతోంది.

నాన్న జబ్బు ఎక్కువౌతోంది. నాన్న పెన్షను, అన్నయ్య జీతం యిల్లు గడిచేందుకు చాలటం లేదు. నాన్న మందులకే నెలకు వంద రూపాయలు పైగా అవుతోంది. అన్నయ్య తెచ్చే జీతం చాలటం లేదు. అందుచేత రాత్రుల్లు కూడా ఎక్కడికో వెళ్లి పనిచేసి యింకో ఏభై రూపాయలు సంపాదిస్తున్నాడు. రోజూ రాత్రి పన్నెండు, ఒంటి గంటకు యింటికి వచ్చేవాడు. అన్నయ్య ఆరోగ్యం దెబ్బతింటోంది. ఇరవై రెండు సంవత్సరాల అన్నయ్యకు అప్పుడే ముసలితనం వచ్చింది.

(55-వ పేజీ )

# అద్దెకొంప

"రవి"

"ఏమోయ్! ఇన్నాళ్లూ సత్రవ భోజనం మఠం నిద్రగా సరిపోయింది. ఇక అలా జరగడానికి వీలులేనట్లుగా కనిపిస్తోంది. రేపు ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి వస్తున్నామని కాంతం ఉత్తరము వ్రాసింది" అన్నారు మునిమాణిక్యంగారు. సరే అయితే యేదైనా అద్దెకొంపకటి చూడండి అన్నాను.

ఇన్ని కాఫీనీళ్లు గొంతులో పోసుకొని అద్దెకొంపల వేటకై బయలుదేరాము. కాళ్లు అరిగిపోయేలా తిరిగి తుదకు యెలాగైతేనేం కొలంబస్ అమెరికాను కనిపెట్టినట్లుగా '*To let*' అనే బోర్డును కనిపెట్టాము. ఆ బోర్డును చూడగానే వారి కెట్లున్నదో కాని నాకు ప్రాణాలు లేచివచ్చాయి. ఎందుచేతనంటే తిరిగి తిరిగి విసుగెత్తి వున్నాను గనుక. పొందికగా వ్రాసిన '*Tolet*' అనే ఆ యింగ్లీషు అక్షరాలు, దాని క్రిందనే 'అద్దెకివ్వబడును' అనే తెలుగు అక్షరాలవంక నడుముమీద చేతులు పెట్టుకొని తల నీటుగా పైకెత్తి యెంతో ఆప్యాయనంగా చూస్తున్నాను. ఇంతలో వెనక నుండి ఎవరో "మీకు ఆడవాళ్ళు లేరంటయ్యా! ఆడవాళ్ళవంక అలా దేవిరిచ్చుకొని చూస్తారేం?" అన్నాడు. అంతవరకైతే నేను చూడలేదుగాని తల కొంచెము ప్రక్కకు త్రిప్పి చూచేసరికి మేడమీద నలుగురు ఆడవాళ్లు పచ్చీసుగళ్ళు ఆడుకొంటున్నారు. ఇలా వెనక్కు తిరిగి ఆ మనిషివంక చూచాను. నా గుండె జల్లుమన్నది. ఆ బుగ్గ పుస్తీలు, ఆ జుట్టుముడి, ఆ కనుబొమలు చూచేసరికి యెక్కడో జూ్యలోనుండి తప్పించుకొని వచ్చిన జంతువులా తోచింది. నోట మాట రాలేదు. నా అవస్థ చూచి మునిమాణిక్యంగారు వెంటనే "మేము ఆడవాళ్ళను చూడడానికి రాలేదండి. ఇల్లు అద్దెకివ్వబడును అని బోర్డుంటే దానివంక చూస్తున్నాం" అన్నారు.

"అయితే మీకు యిల్లు అద్దెకు కావాలన్నమాట. మరి ఆమాట చెప్పరేం లోపలికిదయచేయండి." అంటూ మమ్మల్ను లోపలకు తీసుకొనిపోయి కూర్చోండని ఒక కుర్చీ చూపించాడు. తిరిగి తిరిగి వున్న కారణంగా మునిమాణిక్యంగారు గబుక్కున కుర్చీలో కూలబడ్డారు. కుర్చీ ప్రక్కకు పడిపోయింది. వారి తల నేలకు కొట్టుకొన్నది. ప్రాణం కడబట్టింది. నేను వెంటనే చెవులు మూశాను. అతను లోపలకుపోయి గ్లాసుతో మంచినీరు తెస్తూ 'పొరపాటు జరిగింది క్షమించండి. ఆ కుర్చీకి మూడే కాళ్లు. ఆమాట చెప్పడం మరచిపోయాను. క్షమించండి." అన్నాడు. మంచినీరు త్రాగించిన తరువాత కొంచెము సేపటికి తేరుకొన్నారు.

"ఇదిగో యీ భాగమేనండి అద్దెకిచ్చేది. ఇదిగో యిది వంటగది. ఇది పడకగది." అంటూ అతను చెప్పుకు పోతున్నాడు. "అయితే లెట్రినో" అన్నాను నేను.

"లెట్రిక్ పబ్లిక్ లెట్రి నుపయోగించుకోవాలిసిందే కాని మా లెట్రి నుపయోగించుకోవడానికి వీలులే" దన్నాడు. "అయితే యింతకు తమ ఉద్యోగమేమిటో సెలవిచ్చారుకా" రన్నాడు.

"కాలేజీలో పంతుల్ని" అన్నారు మునిమాణిక్యంగారు.

'కాలేజీలో పంతులవా? అయితే పరవాలేదు బాబూ! ఎందుచేతనంటే ఉత్సాహవంతులైన యువతీ యువకులతో తిరుగుతుంటారు గనుక మీభావాలు ఉదాత్తంగానూ, ఉన్నతంగానూ, విశాలంగానూ వుంటాయి. అద్దె అడగకముందే పారేస్తారు. మళ్ళీ కమిటీస్కూళ్లు, ఎయిడెడ్ స్కూళ్ల పంతుళ్లున్నారే, వాళ్లకు యిల్లు అద్దెకివ్వగూడదు. వాళ్లకు జీతాలుసరిగా రానూ రావు; మన కివ్వనూ యివ్వరు. పోనీ వాళ్లు అద్దె సకాలంలో యివ్వకపోయినా గట్టిగా అడిగితే ప్రాణం పోయేవాడిలా చేతులు నలుపుకొంటూ ఎంతో వినయంగా రేపో మాపో యిస్తామని ప్రాధేయపడతారు. ఇక పోలీసు శాఖోద్యోగులకు, ఇన్‌కంటాక్సు వాళ్ళకు యిల్లు అద్దెకిచ్చామా చచ్చామన్నమాటే. వాళ్ళు అద్దెయివ్వరు. ఇల్లు ఖాళీ చేయమంటే చేయరు. పైగా గట్టిగా అడిగితే న్యూసెన్సుకేసులు పెడతామనీ, ఇన్‌కంటాక్సు తగిలిస్తామనీ బెదరిస్తారు. అలాంటివాళ్ళను నమ్మి ఇల్లు అద్దెకివ్వగూడదు. ముందుగానే చెపితే మంచిదని చెపుతున్నాను."

"ఈ సొదంతా యెందుకయ్యా యింతకూ అసలు విషయ మేమిటో తేల్చ"మన్నారు మునిమాణిక్యంగారు.

"అలా కోపపడితే యెలా చెప్పబాబు. ముందుగా చెపితే మంచిదని చెపుతున్నాను. నాలాంటి పెద్దమనిషి, యిలాంటి యిల్లు మీకీ వూరంతా తిరిగినా దొరకవు. అయితే చూడండి బాబూ! తమ కేమిటి,

పంతులుద్యోగమని కాదూ సెలవిచ్చారు. అయితే శని ఆదివారాలుతప్ప తతిమ్మా అయిదురోజులు కాలేజీకి వెళ్లవలసినదేగా?

"ఆఁ."

"అయితే ఉదయాన్నే యేడుగంటలకే లేచి స్కూలుకు వెళ్లాలిగా?"

"అవును."

"ఏమీ లేదండి ముందుగానే చెపితే మంచిదని చెపుతున్నాను. మీరు ఉదయాన్నే స్కూలుకు వెళ్ళగానే యిక మీవారు రేషను అయిపోయింది కొంచెము తెచ్చిపెట్టండనో, స్టోర్సులో పంచదారయిస్తున్నారట కొంచెము తెచ్చిపెట్టండనో, మార్కెట్టుకు వెళ్లండనో, అమ్మాయి జలుబుచేసింది, కొంచెము డాక్టర్ను పిలవండనో మా దుంపతెంచుతారు. అందుకని ముందుగానే చెపితే మంచిదని చెపుతున్నాను."

"ఏడిచినట్లే వున్నది. ఒక్కచోటవున్న తరువాత వొకరికొకరు సహాయపడకపోతే యెలాగయ్యా! మీకు యిబ్బందివస్తే మేము, మాకు యిబ్బందివస్తే మీరూ సర్దుకోవాలి."

"ఒకనాడు రెండురోజులైతే ఎలాగైనా సర్దుకోవచ్చు. వారానికి అయిదురోజులు. సరేకాని తమకు కుక్కపిల్లలు గాని, పిల్లులు గాని యేమైనా..?

"అలాంటివేమీ లేవయ్యా!"

"అలా కోపపడతారేం బాబూ! ముందుగా చెపితే మంచిదని చెపుతున్నాను. కుక్కలూ, పిల్లులూ వుంటే ఇదిగో మీ పిల్లి మా పాలకుండ పడదోసినదనో, మీ కుక్కపిల్ల మా పిల్లవాని అన్నంలో కలియబడి తిన్నదనో యింటిమీదకు తగాదాలు తెస్తవి. అందుకని ముందుగా చెపితే మంచిదని చెప్పుతున్నాను."

"అసలు విషయం చెప్పకుండా యీ వెధవ సోదంతా యెందుకయ్యా?" అంటూ ముఖం చిట్లించుకొన్నారు మునిమాణిక్యంగారు.

"ఏదో వెనకటి కాలపు వాడిని గనుక నాదంతా వెధవ సోదిగానే కనిపిస్తుంది మీకు. సరే కాని మీకు నస్యం పీల్చే అలవాటుకాని, పొగాకు నమిలే అలవాటు గాని యేమైనా వున్నాయా? ఏమీ లేదండి. ముందుగానే చెపితే మంచిదని చెపుతున్నాను. ఎక్కడ బడితే అక్కడ పాఱున చీది, తుపుక్కున వూస్తారని నా అనుమానం. అందుకని అడుగుతున్నాను."

ఈ మాటతో మునిమాణిక్యంగారికి కోపం వచ్చింది. చివాలున లేచారు. దారి పట్టారు. తొందరగా పోవడములో గడప నెత్తికి కొట్టుకొన్నది. బొప్పి కట్టింది. కండ్లవెంట నీరు తిరిగాయి. అయినా తిరిగి చూడకుండా దారిపట్టాం.

"ఏమేవ్. ఈయన ఎవరో కండ్లజోడున్నా కనిపించక దరవాజాకు కొట్టుకొన్నాడు. దరవాజా పడిపోయింది." అనే మాటలు వెనకనుండి వినిపించాయి.

సరాసరి స్టేషనుకు వెళ్ళారు. కాంతం గారప్పటికప్పుడే రైలుదిగి మునిమాణిక్యంగారికొరకు యెదురుచూస్తున్నది.

[నేను పెట్టిన తిప్పలన్నీ పడి నా కథానాయకుడుగా కుదిరిన మునిమాణిక్యంగారికి అంకితం] 



'పిన్నీ!' 'వచ్చావా నాయనా' ఎన్ని మార్లు వచ్చినా కాని సెంట్రల్ స్టేషన్ ఒంటిగా దాటలేని రంగమ్మ సత్యంతో ఎంతో ఆదుర్దాగా అంది 'మీ బాబాయి ఇచ్చిన టెల్లిగ్రాఫు అందిందా ?'

ఆమె మాటలు వింటున్న సత్యానికి కొద్దిగా నవ్వు వచ్చింది నవ్వును అతి నాజూకుగా ఆపుకోతలిచాడు. కాని అది సెంట్రల్ స్టేషన్ దాటివచ్చేవరకూ ఆగందే!

'అక్కయ్య కెలా ఉంది నాయనా'

'ఏం, బాగానే ఉంది నిన్నటినుంచి! ...ఏటాక్సీ'

'టాక్సీ క్కారెందుకురా నాయనా బోలెడు డబ్బడుగుతారు. మోటారుబస్సులో వెళ్ళగూడదటరా ?'

'మరేం ఫరవాలేదులే ఎక్కుపిన్నీ' పల్లెటూరివాళ్లు ఒట్టి పిసినిగొట్లు అనుకొన్నాడు సత్యం.

పట్నవాసం మనుష్యులకు డబ్బు అంటే లక్ష్యం లేదు అనుకుంది రంగమ్మ.

* * *

అక్క సుబ్బలక్ష్మకు కొంచెం సుస్తీగా ఉందని తెలిసి చూచిపోదామని వచ్చింది రంగమ్మ. అడయారులో వాళ్లు ఇల్లుకొన్న తర్వాత ఇదే రావటం కూడాను. రంగమ్మ వాకిట్లో అడుగు పెడుతూనే పెదవి విరచింది.

'పండుగపూట ఏదో కళకళ లాడేందుకు ఇంత పసుపుకుంకం పెట్టిన కడపేనా లేదే ఇదేం ఇల్లు' అనుకుందామె. ఇంట్లో కావలసినన్ని, అంటే యజమానివద్దనుంచి వంటావిడ వరకూ తలకొక గది. పోగా వచ్చేపోయేవారికి ఒకగది, రోగిష్టులకు కొంచెం దూరంగా ఒక గది. ఏమంత జబ్బు లేకపోయినా, సుబ్బలక్ష్మమ్మను అంత దూరంగా ఉంచటం రంగమ్మకు ఆశ్చర్యంగా తోచింది. లేపాక వేళ తనకు ఏ జబ్బో చేసిందా ఇంతేనా? పైగా ఆ గదిలోకి సామాన్యంగా ఎవ్వరూ పోరు.

ఆపురుమంటూ అకల్మషప్రేమతో కౌగలించుకున్నారా అమాయికపు అక్కచెల్లెండ్లు.

* * *

వంటావిడ నిద్రలేచేసరికి రంగమ్మ స్నానంచేసి కుంపటిమీద కాఫీకి నీళ్ళు పడేసి రుక్మిణీ కల్యాణం చదువుకుంటోంది. మెల్లిగా ముసుగు సవరించుకుంటూ నిద్ర కళ్ళతో వచ్చింది వంటావిడ తన గది నుంచి.

'ఇదేమిటమ్మా నీవు కూడా ఇప్పుడు నిద్దరేస్తున్నావు ?' అంది రంగమ్మ ఉండబట్టలేక.

ఇలా ఆమెను అడిగేవారు లేకనే అని ఇద్దరికీ తెలుసు.

'ఎవ్వరూ లెగవకముందే నేనుమాత్రం లెగిసి, ఏమిదాచేస్తును మీరుదా చెప్పండెమో ?' ఓ లాయురు పోయంటు విసరిందావిడ.

'ఏం మా అక్కయ్య పూజచేసుకోటంలా పొద్దున్నే లేచి ?'

'పాపం ఆవిడకు బక్తిదా. అయినాసుం, వారు సత్యం ఆమెను గేలిచేస్తురే? అందుకు వారంతా పోయి వుడిసినతర్వాతదా చేసును.'

వీళ్ళూ మనుషులేనా అనిపించింది రంగమ్మకు. వారి కిష్టంలేకపోతే మరొకరిని ఎందుకు ఎగతాళిచేయాలో ఎంత ఆలోచించినా ఆవిడకు అర్థంకాలేదు. 'మరి కిరస్తానీవాళ్ళైపోతున్నారమ్మా' అందామె కాని వాళ్లు ఆదివారం తప్పక చర్చలకు వెళ్తారని పాపం ఆవిడ కేం తెలుసు ?

మధ్యాహ్నం పదికల్లా అందరి భోజనాలూ అయ్యాయి. వంటావిడ తన అక్కగారింటికి బయల్దేరింది చూచివచ్చేందుకు సంచీతో సహా.

మాటల సందర్భంలో హెచ్చరించింది రంగమ్మ వంటావిడ సంచీ లావుగా ఉందని సుబ్బలక్ష్మతో. "పోనీయమ్మా ఏం చేద్దాం. గొర్రెలను మింగేవారు పోతే బర్రెలను మింగేవారు వస్తున్నారు. మనం చూచీ చూడనట్లుండాలి." అందామె! రంగమ్మకు నవ్వాలో ఏడవాలో తోచలేదు.

* * *

'మిసెస్ రావుగారున్నారాండీ ?' లేకు తాగ్గా కార్లోనుంచీ దిగి ఓ వని



తాత్రయం రంగమ్మను పరీక్షకని అడిగిన ట్లడిగారు.

'లేరమ్మా ఆఫీసుకి వెళ్ళారు' అమ్మ, అనాలో అయ్యా అనాలో వాళ్ళని తెలియక తికమకపడుతూ జవాబు చెప్పింది వాళ్ళకు. ఈలోపల నౌకరు 'ఉన్నారంటూ' వచ్చాడు. పాపం వాడే చెప్పాడు రంగమ్మతో, అది సుబ్బలక్ష్మమ్మకు ఇంగ్లీషు పేరని, వాళ్లు సుబ్బలక్ష్మమ్మ ఆరోగ్యం బాగాలేదని తెలిసివచ్చారని!

'రంగా, కాఫీపెట్టమ్మ వాళ్ళొచ్చారు' అంది సుబ్బలక్ష్మమ్మ. జబ్బుమనిషిని చూడటానికి వచ్చినవారికి కూడా మర్యాద చేయాలని ఆనాటివరకు ఆమెకు తెలియదు.

* * *

పదిరోజుల్లో కొంచెం తేలికపడింది సుబ్బలక్ష్మమ్మవళ్ళు.

'అక్కయ్యను మావూరు తీసికెళ్తా బావా' అంది రంగమ్మ.

'అదెందుకమ్మా, ఒళ్లు ఇంకా పూర్తిగా నయం కాలేదుగా' అన్నాడాయన.

'నయమయేందుకేగా మా వూరు పిల్చుకెళ్తాను. అక్కడ దానికి గాలితోటే బాగౌతుంది ఇక్కడ ఇంజక్షన్లవల్ల వచ్చిన జబ్బంతా!'

'పిల్లాడి పరీక్షలు...'

'పిల్లాడి పరీక్షలకు అది చదువుతుందా ఏమిటి? పరీక్షలు కాగానే వాడిని కూడా పంపు.'

'ఇంతకీ ప్రయాణం ఎప్పుడమ్మా'

'ఎల్లుండి ఆదివారం బాగుందన్నాడు శాస్త్రుల్లు పొద్దున్నే బాగులేదు. అందుకని మధ్యాహ్నం పేసింజరుకు పోతాము...'

ఆమె సనాతన ఆచారాలను చూసి, మింగలేక, కక్కలేక ఊరుకుంటున్న రావుగారికి ఆమె వారవర్జాలు విసేసరికి నవ్వు వచ్చింది కాని ఆపుకున్నాడు.

* * *

మొదట ఆరేళ్లప్పుడు వెళ్ళాడు సత్యం రంగమ్మగారి ఊరు. ఆనాడే తనకు ఆ అనాగరికపు ఊరు నచ్చలేదు. పైగా తన తండ్రి అతి నాజూకుమంతుడు. పల్లెటూళ్ళను గురించి చక్కగా కొడుక్కు వర్ణించి చెప్పాడు అంతకన్నా నరకం లేదని. ఇంకేం కావాలి మళ్ళీ ఆ గడప తొక్కలేదు సత్యం రంగమ్మ బ్రతిమలాడినా కూడా.

కాని ఈనాడు తప్పలేదు. సుబ్బలక్ష్మమ్మను పిల్చుకురావటానికి వెళ్ళున్నాడు రావుగారు. పిన్నమ్మగారి ఊరిని, పల్లెటూళ్ళో ఉన్నందుకు వాళ్ళను, పంపినందుకు తన తండ్రిని, వెళ్ళినందుకు తన తల్లిని తిట్టుకుంటూ రైలెక్కాడు ఆమెను పిల్చుకొచ్చేందుకు.

* * *

ముందుగా ఉత్తరం వచ్చింది కాబట్టి సుబ్బయ్య రెండెడ్లబండి కట్టించుకుని స్టేషనుకు వచ్చాడు. ఎన్నాళ్ళనుంచో రానంటున్న సత్యం రైలు దిగుతూంటే సుబ్బయ్య హృదయంలో పవిత్రమైన పల్లెటూరి ప్రేమ ఉప్పొంగింది. అది ప్లాట్‌ఫారమ్‌మీద సత్యాన్ని కౌగలించుకున్నంత వరకు అణగలేదు.

సత్యానికి ఆయన వాలకం చూసి పరమ





అసహ్యం వేసింది. కాని ఏం చేయగలడు. స్టేషనులోనుంచి రాగానే, తెచ్చిన కారియర్‌లో అన్నం తీసి సత్యానికి పెట్టాడాయన. అంత అసహ్యం వేసిన సత్యం అయిదు నిమిషాల్లో ముగించాడు తెచ్చిన భోజనం.

* * *

మద్రాసు చాలా బాగుంటుంది అంటారే కాని, అలాఅనేటప్పుడు వారు సావుకారుపేట, క్రిష్టాపురం మరచిపోయి, మాంబలం, మైలాపూర్లనే గుర్తుంచుకుంటారు. నిజానికి పల్లెటూరి పశువులదొడ్లు కూడా సావుకారుపేట అంత మురికిగా ఉండవు. ఆ వూరులో చక్కటి రోడ్లు వేయకపోయినా పొద్దున్నే నీళ్లు చల్లిన ఆ వూరి వీధులు కూడా రోడ్లలాగే శుభ్రంగా ఉన్నాయి.

'అబ్బో నేనీ బండ్లో రాలే'నంటూనే ఇల్లు వచ్చేవరకూ కదలకుండా ఆ బండిలోనే కూర్చున్నాడు. దిగగానే అతిథులు కూర్చునేందుకు వేసిన అరుగులు, పసుపు కుంకుమలతో, పచ్చని తోరణాలతో శుక్రవారపు మహాలక్ష్మికి చేసిన అలంకారం, సత్యానికి తెలియకుండానే కన్నుల పండుగా తోచాయి. ఎటొచ్చీ వారి ఇల్లు కూడా, తన ఇల్లంత ఉంది. కాని అక్కడ ఉండే రోగుల గదికి బదులు ఇక్కడ ధాన్యపుగది ఉంది.

సత్యానికి తన తల్లినిచూస్తే ఆశ్చర్యం వేసింది. మిసమిసలాడుతూ ఎంతో ఆరోగ్యంగా తయారయి ఉంది! ఇన్నాళ్ళకు వచ్చాడని అతన్ని చూచేందుకు చాలా మంది వస్తున్నారు.

* * *

సుబ్బయ్య వేపచెట్టుక్రింద ఒక పూరిపాక వేసుకుని, చుట్టూ వట్టివేళ్ళ తడికలు కట్టించి ఆవుపేడతో అలికించి నీలగిరిలా తయారు చేసుకున్నాడు. సత్యం అందులోనే ఉన్నాడు కూడాను. తెచ్చిన రెండు పుస్తకాలు చదివిన తర్వాత ఆ గదిలో ఉండే పుస్తకాల బీరువా ఓమాటు తిరగవేశాడు. తీయగానే అతనికి వచ్చింది వేయిపడగలు.

తెలుగువారు కూడా నవలలు వ్రాయగలరా? అని సత్యం అనుమానం. కాని మొదటి పేజీ చూస్తోంటేనే అతనికి తెలియకుండానే ఇది మన నవల అనిపించింది. మన సంప్రదాయాలు, ముఖ్యంగా మన పల్లెటూరి జీవితాలు వీటన్నిటినీ గురించిన వర్ణన చదువుతూంటే అందులోఉన్న పాత్రలన్నీ కళ్లకు సత్యానికి. అతర్కాలు ఎంతో బాగా ఉన్నాయి అనుకున్నాడతను. పసిరిక ఎలాఉంటాడో అతనితోపాటు అంతలేదు కాని పసిరిక చనిపోతోందంటే కన్నీళ్ళు కార్చకుండా ఉండలేకపోయాడు.

కాని సత్యం హృదయాన్ని పూర్తిగా కదిలించింది అరుంధతి మరణము. ఎందుకు చనిపోయిందా అంతచిన్న వయసులోనే అనిపించిం దతనికి.

మద్రాసులో ఇన్నాళ్లనుంచి ఉంటున్నా ఎక్కడా దొరకలేదు తనకా పుస్తకము సరికదా, ఆంధ్రులకోసం అన్న ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కూడా లేదన్నమాట వినాడు ఎవరో అంటోంటే! అలాంటిది ఓ పల్లెటూరిలో దొరికింది.

చెన్నపట్నము కూడా ఒకప్పుడు సుబ్బన్నపేటలా ఉండేదా? తన పిన్నిగారి ఊరు కూడా ఏనాటికైనా మారిపోతుందా?

పుస్తకం పూర్తిచేసిం తర్వాత ఓ మాటా కవి కాళ్లమీదపడి వస్తామనిపించిం దతనికి.

* * *

'రంగప్పా'

'ఏం లక్ష్మక్కా?'

'బుజ్జిబాబొచ్చిండంటే చూదామని వచ్చా. ఈ రోవ్వంత ఆయన ఆకులో వెయ్యప్పా' అంటూ ఓ శేరు పెరుగు తెచ్చింది.

రంగమ్మ నవ్వుతూ తీసుకొంది. తనకు పాడిలేక కాదు. లక్ష్మక్క తృప్తికోసం!

'పిలువప్పా బాబు నోమాటు చూడాల'

అన్నీ వింటూఉన్న సత్యం తప్పదని వచ్చాడు. 'అబ్బో ఎంతో డిపాయనావు బాబూ' అంటూ ఆమె వచ్చి సత్యం బుగ్గ గిల్లింది.

'ఏమిటిది' అరవబోయాడు సత్యం కాని వానజల్లులాంటి ఆ పల్లెటూరి లక్ష్మపవిత్ర మాతృప్రేమ, రగులుకోపోయే తనకోపాన్ని నిముసంలో చల్లార్చింది.

'మన రైతు భార్య రా...' అంది రంగమ్మ.

'వయిటేల పిల్లోడి నంపుతా కాని యెల్లి నాలుగు ముంజెలు తిను. సల్లంగ ఉంటాయి' అంది ఆమె.

ఏనాడయినా తన ఇంటి వంటావిడ ఇంత మెల్లిగా పిల్చి ప్రేమగా అన్నం పెట్టిందా? అనే భావం వచ్చింది సత్యం మనసులో.

* * *

'రంగమ్మొదినా...'

'ఆ...ఎవరు, పేరీ ఏం?'

'రాములచ్చమ్మ మిమ్మల్ని పిల్చుకు

(43-వ పేజీ చూడండి)

సీరియల్ నవల

# రెండు మహానగరాలు

చార్లెస్ డికెన్స్

## 26

ఉజ్వలమైన వసంతోదయం; వివాహ శుభలగ్నం ఆసన్నమైంది. వివాహమహోత్సవానికి అంతా చర్చికి బయలుదేరబోతున్నారు. డాక్టర్ మానెట్ ముందువాకిట్లో నిల్చుని చార్లెస్ డార్నేతో ఉల్లాసంగా మాట్లాడుతున్నాడు. పెళ్లికూతురు, లారీగారూ, మిస్ ప్రాస్, ముగ్గురూ ఆనందంగా వున్నారు. తన తమ్ముడు సాల్మన్ పెళ్లికొడుకైతే ఇంకా బాగుండేదని మిస్ ప్రాస్‌కు లోలోపల కొంచెం కించంగానే వున్నా, సర్వంసిద్ధమైపోయింది గనుక యిక అలాటిదేమీ యోజించి లాభంలేదని మనసుకు నచ్చజెప్పుకుంది.

లారీ, పెళ్ళికూతురు చుట్టూ తిరుగుతూ, పెళ్ళికూతురు ధరించిన వస్త్రాలంకారాలను పరిశీలనగా చూసి అభినందించుతున్నాడు.

'లూసీ! ఇంత చిట్టి పసిబిడ్డను ఒళ్ళో వేసుకొచ్చాను—ఇలాంటి ఆనందదినం అనుభవించటానికే గావల్ను; ఆనాడు యింతదూరం ఆలోచించనేలేదు సుమీ! మిత్రుడు చార్లెస్‌కు కానుకగా యివ్వటానికి ఈ అమూల్యమాణిక్యాన్ని మూటగట్టుకు తెచ్చుకుంటున్నానని ఆవేళ ఊహించలేకపోయాను.' అన్నాడు లారీ.

'చార్లెస్‌కు యిద్దామని నువ్వెప్పుడైనా అనుకున్నావా యేవిటసలు?' అని యీసడించింది మిస్ ప్రాస్.

'అవున్లే! అల్లా కళ్లనీళ్లు బెట్టకు మరీ!'

'కళ్ళనీళ్ళు బెడుతున్నది నువ్వా నేనా?'

'నేనా?'—

'అవును నీమాటే!—నేను చూశ్ళేదా యేవిటిలే—నువ్వు బహుమతి యిచ్చిన ఆ వెండిప్లేటూ ఆ చెంచాలూ వాటి అందం చూస్తే నాకుమాత్రం కళ్ళంబటి నీళ్లు రాలేదా. ఆ సంతోషంలో కళ్లంబటి నీళ్లు గారి అవి కనుపించకుండా కూడా పోయాయ్'—

'అవి యింద్రజాలంగా అదృశ్యమైపోవాలని నా అభిప్రాయం కాదనుకో—అయినా నువ్వు మెచ్చుకున్నావు గనక నాకు సంతోషంగానే వుంది. నాకు కళ్లనీళ్లు వచ్చింది మాత్రం అందుకు కాదులే—నాకు కూడా యీ యేభయ్యేళ్లనుంచీ ఒక భార్య వుంటే ఎంత బాగుండేదనుకున్నాను.'

'ఏవీఁ బాగుండేది గాదు—మీవాళ్ళు నిన్ను ఉయ్యాల్లో పడుకోబెట్టిన్నాడే ఘోటక బ్రహ్మచారిగా బ్రతకమని ఆశీర్వదించారు'—

'అలా అయితే చాలా అక్రమమే చేశారు—అవునుగాని లూసీ! ఈ సంతోషసమయంలో నేనూ, మిస్ ప్రాస్ నీకు చెప్పదగినవి, నువ్వు వినదగినవీ రెండు ముక్కలున్నయ్. మీ నాన్నగార్ని గురించి నీవు బెంగబెట్టుకో నక్కర్లేదు. ఆ విషయం మాకు వదిలివెయ్యవచ్చు; మేఁవు అమిత జాగ్రత్తగా చూస్తూ వుంటాం. అవసరమైతే టెల్‌సన్సు బ్యాంకు బాధ్యతలను కూడా కట్టిపెట్టేసి ఆ వ్యవహారం స్వయంగా చూసుకుంటాను. 'హనీ మూను'కు నీవూ నీ భర్తా వార్‌విక్‌షైర్‌లో వున్న ఈపక్షం రోజులూ ఆ బాధ్యత మామీద వదిలెయ్. మరో పక్షంరోజులు గడపటానికి మీరు వేల్సుకు వెడితే అప్పుడు ఆయనవచ్చి మిమ్మల్ని కలుసుకుంటాడు. ఆరోగ్య ఉత్సాహాలతో కాపాడి నా తండ్రిని నా దగ్గిరికి పంపినందుకు మీకు వందనములు అని నువ్వు ఆవేళ మాకు ఉత్తరం వ్రాసి తీరతావు. చూడు! ఎవరో లోపలికి వస్తున్నట్టున్నారు. ఈ లోగా ఈ ఘోటక బ్రహ్మచారిని ఒకసారి ముద్దుబెట్టుకోని ఆశీర్వదించనియ్యి'

డాక్టర్ మానెట్ చార్లెస్‌ను వెంటబెట్టుకుని గదిలోకి వచ్చాడు. ఆయన ముఖం తెల్లగా వివర్ణమై వుంది. అయినా పైకిమాత్రం చాలా గంభీరంగానే కనుపించుతున్నాడు.

డాక్టర్ మానెట్ కుమార్తె చెయ్యిబట్టుకుని మేడమెట్లు దింపి వీధిలో నిలబెట్టివున్న కోచ్‌లో యెక్కించాడు. మిగతా వాళ్లంతా మరోబండిలో యెక్కి బయలుదేరారు. చేరువలో వున్న చెర్చిలో లూసీడార్నేల వివాహం వైభవంగా జరిగింది.

వివాహానంతరం అంతా యింటికి తిరిగి వెళ్లి భోజనాలు చేశారు.

దంపతులు హనీమూన్‌కు బయలుదేరుతున్నారు. గడపలోకి రాగానే లూసీ తండ్రిని కావిలించుకుని కళ్ళనీళ్లు బెట్టుకుంది. డాక్టరు మానెట్ మాత్రం అమిత గంభీరంగా నిభాయించుకున్నాడు: 'నాయనా! చార్లెస్! వచ్చి తీసుకువెళ్లు!' అంటూ అల్లుణ్ణి పిలిచి వప్పగింతచేశాడు.

కోచ్ వెళ్లిపోతోంది. లూసీ కోచ్ కిటికీలోనుంచి ముందుకు వంగి కడసారి తండ్రివంక చూసి చెయ్యి వూపింది.

దంపతులకు వీడ్కోలు ఇచ్చి లారీ, మిస్ ప్రాస్, డాక్టర్ మానెట్, ముగ్గురూ తిరిగి లోపలిహాల్లోకి వచ్చారు. లోపలికి వచ్చీ రావటమే డాక్టర్‌లో భయంకరమైన మార్పు వచ్చినట్టు లారీ గమనించాడు. డాక్టర్ మానెట్ మాటమాత్రమైన్నా పలుకకుండా పూర్వంమాదిరిగా, జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి తల తడుముకుంటూ మౌనంగా తన గదిలోకి వెళ్లిపోయాడు.

లారీ మిస్ ప్రాస్ చెవిలో రహస్యంగా చెప్పాడు: 'ఇప్పుడు మనం ఆయన్ను పలకరించకుండా వుండటమే మంచిది. నేను కొంచెం ఆఫీసుదాకా వెళ్లిరావలసిన పనుంది. నేను తిరిగి

అనువాదం: తెన్నేటి సూరి

వచ్చి వెంటబెట్టుకుని షికారు తీసుకెళ్ళి అలా అలా తిప్పి తీసుకు వస్తాను. మరేం ఫరవాలేదు లే—కంగారుపడకు.'

ఆఫీసుకు వెళ్ళటమంటే తేలికగా వెళ్ళొచ్చుగాని, దాంట్లో నించి బయటపడటమంటే ఒక పట్టాన సాధ్యపడే విషయమా మరి? బ్యాంకులో రెండు మూడుగంటలసేపు ఉండవలసి వచ్చింది. అనంతరం చకచకా తిరిగివచ్చి, సరాసరి మేడమెట్లెక్కాడు. డాక్టర్ మానెట్ గదిగుమ్మం ముందు అడుగుబెట్టగానే 'టక్ టక్' సుత్తి దెబ్బలు వినుపించుతున్నయ్.

'అయ్యో బాబోయ్!' అని హడిలి నిల్చునిపోయాడు. మిస్ ప్రాస్ గగ్గోలు బెట్టుకుంటూ దగ్గిరికొచ్చింది: 'కొంప మునిగిపోయింది!—అమ్మాయికి యేం చెబుదాం?—నన్ను గుర్తుపట్టడం లేదు; చెప్పులు కుట్టడం మొదలుబెట్టాడు!' అంటూ గుండె గుండె బాదుకుంటోంది.

నానా తంటాలూబడి, మిస్ ప్రాస్‌ను అలా అలా సముదాయించి, లారీ నెమ్మదిగా డాక్టర్ గదిలోకి అడుగు బెట్టాడు. డాక్టర్ మనలోకంలో లేడు. వంచిన తల యెత్తకుండా అయోమయంగా కూర్చుని చెప్పులు కుట్టేస్తున్నాడు.

'డాక్టర్ గారూ! ఇటుచూడండి! డాక్టర్ గారూ!'

డాక్టర్ ఏమిటన్నట్టు తలపైకెత్తి, ఒకక్షణంసేపు పరకాయించి చూశాడు. తిరిగి తల దించేసుకుని తన పనిలో తాను నిమగ్నుడైపోయాడు.

లారీ దగ్గిరికి వెళ్లాడు. ఆయన కుడుతున్న చెప్పు కాక, అక్కడ మరొక చెప్పు పడివుంది. లారీ ఆ చెప్పు చేతులోకి తీసుకుని: 'ఇది యే నమూనా చెప్పు?' అన్నాడు.

మానెట్ తల పైకెత్తి చూడకుండానే గొణిగాడు: 'ఆడవాళ్లు షికారువెళ్లే నమూనా—వాటిని చాలారోజుల క్రితమే పూర్తి చెయ్యవలసింది—పూర్తి చేసెయ్యాలి.'

'కాని డాక్టర్ గారూ! ఇటు చూడండి— నావంక చూడండి! నన్ను గుర్తు బట్టలేరా?—మీ వృత్తి చెప్పులు కుట్టుకోవడం కాదు—ఇటు చూడండి!—ఆలోచించండి!'

తల పగలగొట్టుకున్నా, ఆయన మాట్లాడే స్థితిలో లేడు. గోడతో మాట్లాడితే ఎంత ప్రయోజనకరమో, ఆ సమయంలో ఆయన్ను పలకరించటం అంత ప్రయోజనకరం!

లారీ మథనలో పడ్డాడు. మొదటిది, ఈ విషయాన్ని లూసీకి తెలియనియ్యకూడదనుకున్నాడు. రెండోది లూసీకే కాకుండా యే మనిషికీ తెలియనియ్యగూడదనుకున్నాడు. మిస్ ప్రాస్‌తో ఆలోచించాడు: డాక్టర్ గారికి వంట్లో బాగుండలేదనీ, ఆయన విశ్రాంతి తీసుకుంటున్నట్టూ, డాక్టర్ గారికోసం వచ్చే రోగులకందరికి చెప్పి పంపివేశాడు. రెండవది: మిస్ ప్రాస్ చేత లూసీకి ఉత్తరం వ్రాయించాడు—డాక్టర్ గారు ఎవరో రోగికి చికిత్స చేసే నిమిత్తం గ్రామాంతరం వెళ్ళినట్టు, గ్రామాంతరంనుంచి మిస్ ప్రాస్‌కు ఉత్తరం వ్రాసినట్టూ.

డాక్టర్ గారు త్వరలో తిరిగి తేరుకోగలడనే ఉద్దేశంతో లారీ యీ చర్యలు తీసుకున్నాడు. ఇంకా యేమిటంటే, తన జీవితంలో మొట్టమొదటిసారిగా ఉద్యోగానికి సెలవుబెట్టి, పగలూ రాత్రీ ఆయన్ను కనిపెట్టుకు కూర్చోటానికి నిశ్చయించుకున్నాడు. డాక్టరు గదిలోనే కిటికీకి చేరువుగా బల్లా కుర్చీ వేసుకు కూర్చుని, ఆయనవంక చూడనట్టు నటించుతూ, ఆయన్ను జాగ్రత్తగా గమనించుతున్నాడు.

ఆయన్ను పలకరించి లాభంలేదనే విషయాన్ని మొదటి నాడే గమనించాడు. ఎంచేతనంటే: పలకరించినకొద్దీ ఆయన మరింత చికాకు పడుతున్నట్టు కనుపించుతున్నాడు. అందుచేత: అల్లాంటి అయోమయావస్థలో పడ్డందుకు అసమ్మతి సూచకంగా నిలబెట్టిన పోస్టర్ బొమ్మలా ఆయనకు ఎదురుగా మౌనంగా కూర్చు

(40-వ పేజీ చూడండి)



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 26. ద్రవపదార్థాలు ఘనీభవిస్తే రంగెందుకు మారాలి?

"నెయ్యీ, క్రొవ్వూ, నీరూ ద్రవరూపముగా ఉన్నప్పుడు ఒక విధమైన రంగులతో ఉండి ఘనీభవించగానే తెల్లగా వుంటాయి. ఎందువల్ల?" అని మండపల్లి నుంచి టి. ఎ. రామరాజుగారు అడుగుతున్నారు.

ఏవస్తువేనా మనకి కనబడడానికి దాని నుంచి మనకు చేరే వెల్తుగు కిరణాలే కారణము. ఒక వస్తువు నుంచి మనకివచ్చే వెల్తురు, ఆ వస్తువుయొక్క ముఖమునుంచి పరావర్తమైనదైనా కావచ్చు, ఆ వస్తువులో ప్రవేశించి ఆవస్తువుయొక్క అణువులవల్ల విరజిమ్మబడినదేనా కావచ్చు; లేదా ఆవస్తువున కవతలి వైపునుంచి దానిలో ప్రవేశించి మనవైపువచ్చినదైనా కావచ్చు. నీరూ, కరిగిన నెయ్యీ, కరిగిన క్రొవ్వూవంటి పారదర్శక ద్రవాల్లోకి వెల్తురు ప్రవేశించగలదు. అంటే వాటి ఉపరితలను వెల్తుర్ని ఎక్కువగా పరావర్తించదన్న మాట. ఇక ఆద్రవాలు మనకి కనబడుతున్నాయంటే వాటి అణువులు విరజిమ్మే వెల్తురువల్లనే. ఈ వెల్తురు, నేయి ఉన్న గిన్నె అడుగు మన వైపుపంపే వెల్తురుకన్న చాల తక్కువ కాంతిమత్వము కలది; కనక గిన్నె అడుగున మరుగు పరుస్తున్నట్టు, అంటే కొంచెం నల్లగా - కనబడుతుంది. నీరూ, కరిగినక్రొవ్వూకూడా ఇంతే.

ఇక, ఘనీభవించిన నీరు, మంచుగడ్డ అన్నమాట. తాను మాత్రమే ఘనీభవించి, తనలో కరిగి వున్నదానిని చిన్న చిన్న బుడగలరూపంలో తనలో పట్టి వుంచుతుంది. వెల్తురు మంచుగడ్డమీద పడినప్పుడు మంచుగడ్డ ముఖము ఆ వెల్తురిని కొంత మట్టుకు పరావర్తము చేస్తుంది. (నీటి ఉపరితలము చేసిన మాదిరిగానే.) మంచు గడ్డలోకి చొచ్చుకున్న వెల్తురు గాలి బుడగల మీదపడినప్పుడు, గాలీ మంచుగడ్డల పొలిమేరల దగ్గర మళ్లీ పరావర్తమౌతుంది. కనక బుడగ బుడగా వెల్తుర్ని పరావర్తము చేసి గడ్డని మొత్తమ్మీద తెల్లగా కనపరుస్తుంది. మరిగించి గాలిని తీసివేసిన నీటిని పింగాణి చిప్పలోపోసి చూసి, ఆ నీటిని అలాగే ఘనీభవింపజేసి చూస్తే రెండింటికీ తేడా కనపడదు.

నెయ్యీ, క్రొవ్వూ మాత్రము ఘనీభవించినతర్వాత పారదర్శకములుగా ఉండవు. కరిగిన నేతిమీద పలాచని పొగకట్టడము మన మందరమూ ఎరుగుదుము. దానిక్రింద ద్రవరూపంలో వున్న నెయ్యి మనకి కనబడనీయకుండా ఈ పొర అడ్డతుంది. అంటే ఈపొర కరిగిన నెయ్యివలె పారదర్శకము కాదన్నమాట. పారదర్శకము కాని పదార్థాలన్నీ తమ మీద పడ్డ వెల్తురులోంచి తమ స్వభావాని కనుగుణంగా కొన్ని రంగుల్ని పీల్చేసుకుని మిగిలిన రంగుల కిరణాల్ని పరావర్తము (*Reflect*) చేస్తాయి. ఎర్రరంగుని మాత్రమే పరావర్తము చేసేవస్తువులు ఎర్రగా కనపడతాయి. నెయ్యీ, క్రొవ్వూ, మైనమూ ఘనీభవించి ఉన్నప్పుడు, తమమీదపడ్డ వెల్తుర్ని కొంత తినేసి, మిగిలిన దాన్ని పరావర్తము చేస్తాయి. అలా పరావర్తమై మన కంటివైపు తిరిగిన వెల్తురులో ఉన్న రంగులే ఆ వస్తువులు ఆరంగులతో కనపడడానికి కారణము. అయితే ద్రవరూపంలో పారదర్శకములైన పదార్థాలు ఘనరూపంలో ఎందుకు పారదర్శకాలు కావు? అని అడుగుతారేమో, ఒక వస్తువు ఎందుకు పారదర్శకమో, ఇంకొకటి ఎందుకు కాదో వైజ్ఞానికుల కింకా తెలియలేదు. "అది వాటి స్వభావము" అనే నేటివరకు తెలిసినవిషయము.

## 27. సృష్ట్యారంభంనించి మానవుడున్నాడా?

అన్నది చిత్రమైన ప్రశ్న అయితే కావచ్చును గాని అర్థమున్న ప్రశ్నమట్టుకు కాదు. ఏమంటే సృష్టికి ఆరంభం అంటూ ఒక ఘట్టము వున్నదని వెర్రిగా నమ్మనువలిసిందేగాని, ఊహచేసి గ్రహించడము సాధ్యముకాదు.

'సృష్టి' అంటే - మానవులా? జంతువులా? పిట్టలా? చెట్లా? భూమీ, సూర్యుడూ, నక్షత్రాలా? మరి ఏది? "ఇవ్వన్నీనూ." అంటారు గడుసువాళ్ళు.

అయితే ఇవ్వన్నీ భూమ్యాకాశాల మధ్య ఠపీమని ఒక్కనాడు పుట్టుకురాలేదు. జగత్తులో జీవమేలేని కాలము ఉన్నట్టు సాక్ష్యము ఉంది. భూమ్యాది గ్రహాలు లేని కాలము కూడా ఉండేది. అప్పుడు వేరే పదార్థమేదీ లేదనడానికి అవకాశము లేదు. అయితే మరి 'సృష్ట్యారంభం' అంటే ?

ఈ విషమ సన్నివేశమునించి తప్పించుకోడానికి భూగర్భశాస్త్రజ్ఞులు చక్కని ఎత్తు ఎత్తారు. భూమి సూర్యుడులాగ జ్వలించిపోతూ ఉండడము మాని ఘనీభవించి చల్లారినప్పటినుంచీ ఏయే మార్పులు వచ్చాయో? అని పరిశోధన చేస్తారు వారు. ఈ లెక్కని మనము 'భూమి ఘనీభవించి చల్లారిన తరువాత బయల్దేరిన రూపాల్లో మానవుడున్నాడా?' అని మన ప్రశ్నని దిద్దుకొని జవాబు చెప్పుకుందాం.

అయితే మానవుడు ఒక కాలంలో వున్నాడని గాని లేడనిగాని చెప్పడానికి ఆధార మేమిటి ? అని అడిగితే, ఉంది ఆధారము. శాస్త్రజ్ఞులు కనుక్కున్న చక్కని ఆధారము ప్రాచీన జీవముల శిలారూపాలు. పూడ్చుకుపోయిన జీవజంతువులు కొన్ని అనుకూలపరిస్థితులు సమకూడితే మాంసంతో, చర్మంతో, రోమాలతో అలాగు నిల్చిపోతాయి. సైబీరియాకి చేరువని ఉన్న రేంగెల్ దీవిలో, మంచులో చిక్కగడ్డతో ఘనీభవించిపోయిన భూతకాలపు ఏనుగ కనపడింది. దీనికి మామూలు ఏనుగుకంటె తొండము లావూ, కాళ్లుపొట్టీ, దంతాలు పెద్దవీ, దట్టమైన బొచ్చూను. మాంసము కోసి తినడానికి వీలుగా వున్నదట!

మధ్యఆశియాలోని మేస్టోడన్ బిలము చుట్టూ తిరుగుతూ ఊబిలో కూరుకుపోయిన ఏనుగులజాతి అస్థిపంజరాలతో కనబడింది. ఈ ఏనుగుల క్రింది దౌడలు పారలలాగుంటేవట. కాలిఫోర్నియాలోని లా బ్రే తారు చెరువులో అనేక రకాల జంతువులూ పక్షులూ మృత్యుముఖం చేరాయి. ఈ తారు ఈ రోజులలో బాగా గట్టిపడినా ఆ యుగాల్లో మెత్తగానే ఉండి యుంటుంది. దానిమీద కొంత మన్నూ వర్షపు నీరూ నిలిస్తే, ఈ ప్రాణులన్నీ దప్పి తీర్చుకోడానికి చేరి, తారులో కాళ్లు చిక్కుకుని క్రమంగా తారులోకి దిగిపోయి చచ్చిపోయాయి. ఏనుగులూ, చిత్రమైన కంగారు మృగాలూ, పొడుగు కోరల సింహ వ్యాఘ్రాలూ, బ్రహ్మాండమైన దున్నలూ, తోళ్లూ, మొత్తము నూటికి పైగా ప్రభూతకాలపు వింత వింత ప్రాణుల అస్థిపంజరాలు దొరికేయి ఈ మృత్యుగహ్వరంలో. ఇవేవీ నేటికాలపు జంతువులలాగు లేవు.

భూతకాలపు జంతువుల రూపాలు నిల్చిపోడానికి వాటికి సజీవ సమాధే ఏర్పడి యుండనక్కరలేదు. నిశ్చలమైన సరస్సులో ఒక జంతువు చచ్చి మునిగిపోయిందనుకోండి. దాని అస్థిపంజరము తప్ప మిగిలిన శరీరమంతా కుళ్లిపోతుంది. అస్థిపంజరము నీటిలో కరగదని మన నమ్మకము. కాని వాస్తవానికి నీటిలో కరగని పదార్థమే లేదు. ఎక్కువ తక్కువలే తేడా. నిశ్చలమైన సరస్సు కొండలలో వుంది అనుకుందాం. శిలాపదార్థము ఎంతో కొంత నీటిలో కరిగివుంటుంది. ఈ నీటికి అస్థిపంజరము లభించింది. నీటిలో శిలకంటె అస్థి ఎక్కువ కరుగుతుంది. కనక క్రమంగా శతాబ్దాల తరబడిని అస్థికణాలు ఆనీట్లో ప్రవేశించి శిలాకణాల్ని తొలిగించేస్తాయి. పంచదారచిలకని ఉప్పుద్రావణంలో వేళ్లాడగట్టితే పంచదారనీట్లో దూరి ఉప్పుని తొలిగించేటట్టే! అయితే అస్థి నావరించిన నీరు శతాబ్దాల కాలము గడిచిపోతేనేగాని అస్థికణాన్ని లాక్కోలేదు. కనక ఈ తొలిగింపులో నీటిలో వున్న శిలాకణాలు తొలిగింపబడిన అస్థికణాల స్థానాల్లో చక్కగా అమిరిపోతాయి. అంటే బహు నెమ్మదిమీద అస్థిపంజరము శిలాపంజరమైపోతుందన్నమాట.

ఇలాగ శిలలైపోయిన చెట్లూ, జంతువులూ, అస్థిపంజరాలు తక్కిన రాళ్ళతో అతుక్కుపోయి భూమిలోకి దిగిపోయాయి. అవి నేటి భూగర్భపరిశోధనలో కనపడతాయి.

జంతువులూ, చెట్లూ భాగాలు బంకమన్నులాంటి మెత్తని నేలమీద పడి ముద్ర పడిందనుకోండి. శతాబ్దులు గడిచి ఈ ముద్రతో కూడా ఆ మన్ను భూమిలోకి దిగిపోయి, మీద నొక్కే పొరల ఒత్తిడికి మాత్రలలాగు గట్టుపడిపోయి ఆ ముద్రని అలాగే చూపిస్తుంది. పర్ణశాల అనే పల్లెకి చేరువన లేడిగిట్ట నొక్కిన ముద్రఉన్న రాయి వుంది. అది పైరీతిగనే శిలఅయిపోయిన మట్టిపెల్ల. దానిని అమాయికులగు యాత్రీకులకు 'మాయలేడి పాదము' అని నేటికీ చూపిస్తున్నారు.

శిలలైపోయే ఈ అఖరి రెండు రకపు చిహ్నాల్నీ ఫాస్సిల్స్ అంటారు. భూత ప్రభూతకాలపు జంతుచిహ్నాల్ని కూర్చి, అవి కనబడిన భూగర్భపు పొరలను బట్టి వాటి కాలాన్ని నిర్ణయిస్తారు. భూమి పొరలు ఒకటి తరువాత ఒకటి ఏర్పడినట్లు సులువుగా తెలిసిపోతుంది. ఈ పొరలలో తక్కిన లోహాలతోపాటు యురేనియమ్ అనే లోహముంటే, ఈ లోహముతో చేరి వుండే సీసపు పాలునిబట్టి ఆ యురేనియము ఎన్నిలక్షల సంవత్సరాలనాటిదో తెలుస్తుంది. ఆ యురేనియముతోపాటు భూగర్భపు పొర వయస్సు ఊహిస్తారు. ఈ పద్ధతివల్ల భూగర్భపుపొరల అసలు వయస్సు తెలియకపోయినా ఒక పొరకీ ఇంకొక పొరకీ గల కాలవ్యత్యాసము చూచాయగా తెలుస్తుంది. దీనినిబట్టి ఆ యా పొరలలోని ఫాస్సిలు జంతువులు బ్రతికి యుండిన యుగాలవరుస తెలుస్తుంది. అంటే ఏ జంతువులు ముందు బ్రతికివుండేవో, వాటి తరవాత ఏ జంతువులు వుండేవో తెలుస్తుంది. ఒకే జంతువు — ఏనుగ అనండి — వరుసగా అడుగునుండి నేటి పొరదాకా గల పొరలలో నాలుగైదింటిలో దొరికితే, ఇన్ని యుగాలకాలములో ఏనుగు జంతువు ఎన్నిమార్పులు పొందిందో తెలుస్తుంది.

ఈ విధంగా చేసిన పరిశోధనవల్ల ఏ జంతువూకూడా ఠపీమని ఒక యుగంలో పుట్టుకురాలేదనీ అతిసూక్ష్మపు జీవకణము నుండి నేటి మానవునివరకూ గల ప్రాణులన్నీ నిరంతరాయంగా సాగివచ్చిన ప్రాణనదీ ప్రవాహములో రేవులలాంటివనీ తెలిసింది. అంటే మానవుడు తొలి సృష్టి కాదు సరేగదా తక్కిన జీవాలతో సంబంధమేలేని ప్రత్యేక ప్రాణికూడా కాదు. సముద్రప్రాణులకు ముఖ్యావసరమైన ఉప్పునీరు మానవుని మనికికి అత్యావసరము. పిట్టలకిలాగ మానవునికి రొమ్మెముక వుందీ, జంతువులకిలాగ వెన్నెముక వుంది. జంతువులకిలాగ పనికిరాకపోయినా పేగుల కొసని చిన్నకొలికి (*Vermiform appendix*) వుంది. ఈ మానవుడేనా స్థిరరూపంతో వున్నాడా ? ఆదిమ మానవుడు శతాబ్దాల తరబడిని పరిణామము పొంది నేటి మానవుడైనాడు. కొన్ని యుగాల్లో (తన్నుతాను నాశనము చేసుకోకపోతే) మానవుడు పూర్తిగా రూపుమారిపోవచ్చును. సృష్టిపరిణామంలో మానవుడున్న కాలము ఒకలిప్త. అయినా ఎంత అహంకారమూ వీడికి ?






# యోగి జడ

శ్రీ పులిచేరి మోహన్

అనగా అనగా ఒక యోగి
యోగికి జడ ఒకటుండేది
వీపు నానుకుని వానిజడ
అటునిటు ఊగుచు నుండేది.
అట్లుండగను ఒకనాడు
ఆశ్చర్యముతో నావటువు
ఆలోచించెను ఓరిమితో
సుందరమైనది నాదుజడ
ముందరవుండిన హాయిగద
ముందుకు తెస్తా చూడనుచు
మంద బుద్ధితో తలుచుకొని
యొగిరి గంతులూ వేశాడు
అటునిటు ఊరికె తిరిగాడు
ప్రదక్షిణాలెన్నో చేశాడు
పాపం కడు శ్రమ నొందాడు.
అయితే మొండిది వానిజడ
వీపును వదలీ కదలదుగ
పాపం బాపని శ్రమయంతా
బూడిదపై పన్నీరేగా!

---




# కాపలావాడి కల

ఒకప్పుడు నిజంగా జరిగినవే మరోఅప్పుడు కథలుగా మారుతుంటాయి. నేను మీకిప్పుడు చెప్పబోయే కథకూడా కొన్ని సంవత్సరాలక్రితం నిజంగా జరిగినదే!

ఒక ఆఫీసులో సాహు అనే వొక కాపలావాడు వుంటూవుండేవాడు. అతడు చాల జాగ్రత్తగల వ్యక్తి. ప్రతిరాత్రీ నిద్ర అన్నమాట ఎరగకుండా ఆ అఫీసుకు కాపలా కాసేవాడు. సామాన్యంగా యెన్నడూ యే విషయంలోను పొరపాటు పడడు.

కాని ఆరోజుతో సాహు జీవితంలో గొప్ప మార్పు వచ్చింది.

అది సుదినమో దుర్దినమో కూడా నిర్ణయించలేము. కాకపోతే, సాహు అంతటివాన్కి యీ పొరపాటు! పాపం మూడు జాములూ కంటిమీద కునుకులేకుండా కాపలా కాశాడు. తెలతెల్లవారిపోతూందనగా, సాహు ఎందుకనో నిద్ర ఆపలేకపోయాడు. ఎలాగూ తెల్లవారిపోతున్నది కదా అని, సాహు నడుం వాల్చేడు. ఇల్లా నడుం వాల్చేడో లేదో నిద్రాదేవత వెంటనే ఆవహించింది సాహుని. ఆ రెండుగంటలలోనే యేనుగులు తొక్కినా మెలుకువరానంత నిద్ర పట్టేసింది.

గాఢనిద్ర. నిద్రలో వొక విచిత్రమైన కల! ఆ కలతో సాహు హృదయం కలత చెందింది. ఉదయం పది గంటలప్పుడు తన యజమాని బస్సులో వస్తూవున్నట్లు ఆ బస్సు ప్రమాదవశాన బోల్తా కొట్టగా, తన యజమానికి ప్రమాదమైన గాయాలు తగిలి ప్రాణాపాయస్థితిలో వున్నట్లు కలకన్నాడు.

తరువాత మెళుకవవచ్చేసింది. అయినాసాహుగుండెదడ చెప్పతరం కాదు. క్షణక్షణం అతని ఆరాటం యెక్కువయిపోతోంది. ఎల్లాగయినా సరే, తన యజమానికి ఆపద రాకుండా చూడాలని తొందరపడ్డాడు. యజమాని యింటికి పరిగెత్తుకు వెళ్లాడు.

"ఏం సాహూ! వుదయమే వచ్చావ్? ఏదైనా ప్రమాదం సంభవించిందా?" అంటూ ఆత్రతగా అడిగాడు యజమాని.

"ఏమీలేదు బాబయ్యా! తామియ్యాల ఆఫీసుకి బస్సులో కాకుండా సైకిలు మీద దయసెయ్యాలి బాబయ్యా!"

"ఏం?" ...ఎందుకు? యివ్వాళ బస్సురాదా?"

"తమకి ఆబస్సు గొడవెందుకు బాబయ్యా! ఏదో ముసలోణ్ణి సెప్పినాను. ఇయ్యాల్టికి మాత్రం మీరు నామాటయినండి బాబయ్యా." అంటూ సాహు ప్రాధేయపడ్డాడు.

యజమానికి సాహు చెప్పిందేమీ అర్థంకాలేదు. అయినా యెన్నడు యెదురునిలచి మాట్లాడని సాహు, యీరోజు యిల్లావచ్చి చెప్పడంలో యేదోఅర్థం వుండకపోదని యెంచి, సైకిలుమీదే ఆఫీసుని వెళ్లాలని నిశ్చయించుకుని, సాహుని పంపివేశాడు.

పదిన్నరయింది. యజమాని ఆఫీసుకువచ్చాడు. తన గదిలోకి వెళుతూ వెళుతూ వొకబంట్రోతుతో "సాహూను పిలుచుకురా," అన్నాడు. ఆ బంట్రోతు సాహు యింటికి వెళ్ళి, వాడిని పిలుచుకొని వచ్చాడు.

"సాహూ! నువ్వు, నాకు ఈరోజు మహోపకారంచేశావు. ఉపకారమే కాదు, ప్రాణం దానంచేశావు.

శ్రీ నేరళ్ల లక్ష్మణరావు

నీమేలు నేనెన్నటికీ మరువలేను. నువ్వుగాని నాకు వుదయమేవచ్చి చెప్పివుండకపోతే, నేను తప్పక ఆ బస్సులోనే వచ్చేవాణ్ణి; ఆ బస్సులో వాళ్ళ గతే నాకూ పట్టేది."

"అసలు జరిగిందేటి బాబయ్యా?"

"ఇవ్వాళ ఆ బస్సుడ్రైవరు బాగా తాగేడట. బస్సును రోడ్డు ప్రక్కనివున్న వొకపెద్ద గుంటలోకి పోనిచ్చేడు. బస్సు బోల్తాకొట్టింది. ఆరుగురు మరణించారు. మిగతా వారికి బాగా గాయాలు తగిలేయి. వాళ్ళందర్నీ మెల్లి మెల్లిగా ఆస్పత్రి చేరుస్తున్నారు. మామూలుగా అయితే నేను ఆ బస్సులోరావలసి వాణ్ణే" అన్నాడు యజమాని.

సాహూ కళ్ళల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. తనకు రాత్రివచ్చిన కలను విపులంగా చెప్పాడు. అందుకే తాను వుదయమే వచ్చి చెప్పాననికూడా అన్నాడు.

ఆ యజమాని సాహుకి రెండు వందల రూపాయలు బహుమాన మిచ్చి యిల్లా అన్నాడు.

"సాహూ! నువ్వు నాకు చేసిన మహోపకారానికి యిది నా బహుమానం. నువ్వు చేసినమేలు యెన్నటికీ మరచిపోలేను. కాని మరో విషయం. ప్రభుత్వ అధికారుల దృష్టిలో మనమిద్దరం సమానులమే. చేసిన తప్పుకి శిక్ష యెవరికైన తప్పదు. కాపలా కాయవలసినవేళ నువ్వు నిద్రపోయి కలలుకన్నావు కనుక నీకు శిక్ష విధించకతప్పదు. ఇందు-యీ పైకం తీసుకొని నువ్వు యింటికి వెళ్ళొచ్చు." అన్నాడు.

సాహూకి పరిస్థితిఅంతా అర్థమయింది. తన రెక్కల మీద ఆధారపడివున్న జీవాలు యెన మండుగురు. వాళ్ళని తనే పోషిం చాలన్నసంగతి ఆ క్షణంలో సాహుకి తోచకపోలేదు. కాని సాహుహృదయం అగాధం. సముద్రపు లోతులనైనా తెలుసుకో వచ్చు గానీ, సాహు హృదయం ఎంత అగాధమో అర్థంచేసుకోవడం యెవరి తరమూ కాదు.

ఉద్యోగం పోయినందుకు సాహుకి యెంతమాత్రం విచారం లేదు. కాని తన యజమాని ప్రాణం రక్షించగలిగేనని మాత్రం యెంతో గర్వపడ్డాడు. అతని కళ్ల వెంట ఆనందాశ్రువులు జోటజోట రాలాయి. 




# డాన్ క్విక్ సెట్

## పూర్వకథ

లామంచా అనే గ్రామానికి చెందిన డాన్ క్విక్ సెట్ అనే వెర్రి వెంగళప్ప ఒకడు తనుకూడా ఒక వీరుడు (నైట్) గా పేరుపొందాలని వుబలాటపడి, 'రోజినాన్టే' అనే ఒక కుంటిగుర్రాన్ని ఎక్కి బయలుదేరాడు. ఒకానొక స్త్రీమూర్తిని ఎంచుకొని ఆమెకు తానే 'డల్ సీనియా' అనే పేరు పెట్టుకొన్నాడు. ఆమె మన్నన సంపాదించటం కోసమే తాను ధర్మరక్షణమనే కఠోరదీక్ష స్వీకరించానని నమ్మాడు.

ఏవేవో వెర్రివెర్రి ఆశలు చూప శాంకో పాంజా అనే ఒక అమాయకపు కూలీని తన బంటుగా చేసుకొన్నాడు. వాడు 'డాపుల్' అనే ఒక గాడిదనెక్కి యీయన వెనకాలే బయలుదేరాడు. ఒకటి రెండు చోట్ల డాన్ క్విక్ సెట్ ఏవేవో సాహసకార్యాల చేయబోయాడు. ప్రతిసారి చావుదెబ్బలు తిన్నాడు.

ప్రథమ జైత్రయాత్రలో అన్నీ శృంగభంగాలే కాగా, డాన్ క్విక్ సెట్ గారు నొంటిపై గాయాలతో యింటికి తిరిగివచ్చి, అవి నయమయ్యేదాకా యింటిపట్టునే వున్నాడు. ఆ సందర్భంలో 'శాంసన్' అనే ఒక కాలేజి కుర్రాడితో యీయనకు పరిచయమైంది. ఈయనగారి ప్రతాపాన్ని గురించి తానేవో పత్రికలలో చదివానని ఆకుర్రాడు చెప్పాడు. ఇంకా అంతకంటే గొప్ప గొప్ప పనులు చేయాలన్న వుబలాటతో, మళ్లీ శాంకో పాంజాను వెంటబెట్టుకొని, డాన్ క్విక్ సెట్ వీర విహారాలకు బయలుదేరాడు. ఈసారి అధర్మాల జోలికి పోబోయేముందు, 'డల్ సీనియా' రాకుమారికి తన ప్రతాపాన్ని సవిస్తరంగా తెలియజెప్పి పోదామని బుద్ధిపుట్టి, టొబోసో వైపుకే దారితీశాడు.

అలాపోగా, పోగా అర్ధరాత్రివేళకుగానీ ఆ పట్టణానికి చేరుకోలేకపోయారు. వీళ్లు అంటే—యిలా నిశాచరుల్లా మేలుకొనివున్నారు కానీ, ఆ పట్టణం పట్టణమంతా ఎప్పుడో మాటు మణిగిపోయింది. అంత పెద్దపట్టణంలోనూ ఆ వేళప్పుడు మనిషి అన్నవాడెవ్వడూ మేలుకొనిలేడు. శాంకో పాంజాకు మాత్రం నిద్దర మత్తుగానూ, బద్ధకంగానూ వున్నది. కానీ డాన్ క్విక్ సెట్ గారికి అటువంటి లక్షణాలు ఏమీ లేవు. ఆయన, ఆ అనన్యరూపసి డల్ సీనియా రాకుమారిని చూడనిదే అసలు, వూపిరైనా పీల్చేట్లు లేడు.

"ఓహోహో! ఇప్పటికికదా నాజన్మ తరించినది! నా మానసహారిణి, ఆ అందాలరాణి, డల్ సీనియా రాకుమారి మేనుసోకిన పిల్లగాలులు నాకు చక్కిలిగింతలు పెట్టుచున్నవోయీ శాంకో..." అంటూ డాన్ క్విక్ సెట్ గారు ముసిముసినవ్వులు నవ్వుతూ, ఆ బంటుగాడివైపు వోరచూపులు కోకొల్లలుగా ఒలకపోశాడు. వాడసలే నిద్దరబద్ధకంగా వున్నాడేమో, యీయన వాగేవాగుడు వాడు ఎంతమాత్రమూ పట్టించుకోవటంలేదు. వాడు ఏమాటా వినిపించుకోకపోవటం గమనించి డాన్ క్విక్ సెట్ గారు వాడి భుజంపట్టుకు వూపులాడించి "శాంకో! శాంకో!—ఓ శాంకో! జాలమేలచేసెదవోయి! ఇకనైనను నా ప్రాణనాయకి డల్ సీనియా రాకుమారి క్రీడలాడెడు కోటలోనికి దారితీయుమోయి!" అంటూ వాడిని బ్రతిమాలబోయాడు.

వాడికి అప్పుడువున్న చిరాకుకొద్దీ, యీయన తన యజమాని అన్నమాటకూడా మరచిపోయి, "కోటఏమిటి, కోట? లోగడ నేను ఆ డల్ సినీయా గారిని చూచినప్పుడు ఆమె యీమాదిరి పూరిపాకలోనే గదండీవున్నది! ఆవిడకు కోట ఎక్కడున్నదీ?" అంటూ అక్కడేవున్న ఒక పూరిపాకకేసి చేయిచాపి చూపిస్తూ నిక్కచ్చిగా అడిగాడు.

"అదేమోయీ; శాంకో! అట్లు మాటలాడెదవేమి! నీవు లోగడ ఆమెను చూచినప్పుడు ఆమె తన కోటలోనే ఒకమూలగా ఏదో ఒకచిన్న సౌధమందు వుండివుండవచ్చును. ఆ సౌధమును పూరిపాక అనెదవేమి?" అంటూ డాన్ క్విక్ సెట్ గారు వాణ్ణి నిలదీసి అడిగాడు. కాకపోయినా, యీబంటు అంతగా కావాలనుకొంటే, తనను అవమానపరచినా ఒకప్పుడు ఒప్పుకొంటాడేమోకాని, తాను త్రికరణశుద్ధిగా

అనువాదం: శ్రీ విశ్వాత్ముల నరసింహమూర్తి

ప్రేమించి పూజించే డల్‌సీనియా రాకుమారినిగూర్చి తేలికగా పల్లెత్తుమాటఅంటే యీాయన ఎంత మాత్రమూ సహించలేడు. అందుకని డల్‌సీనియా అంటే ఎంతగొప్పదో వీడికి బాగా తెలిసివచ్చేదాక చెప్పుదామన్న పంతంకొద్దీ, 'డల్‌సీనియా' రాకుమారి వంటివుత్తమవంశ సంజాత ఏ సందర్భమునసూ తాటిపాకలలో అడుగిడబోద"ని చెపుతూనే అటువైపు వేలుపెట్టి చూపిస్తూ, "నీ కన్నులలో గారడిలేకున్న, అల్లదే, ఆ కనుపించుచున్న కట్టడమే, డల్‌సినియా రాకుమారి నివసించు రాజసౌధము." అన్నాడు.

"అయితే నడవండి; మరియింకెందుకు ఆలస్యం! ఆదికోటే అవుతుందో, గోడగడ్డలే అవుతుందో దగ్గరకుపోయిచూస్తే తేలిపోతుందిగా! మీరు అవుననటం, నేను కాదనటం; ఎందుకొచ్చిన గొడవ యిది!" అన్నాడు శాంకోపాంజా.

ఇద్దరూ వాహనాలను ఆవైపుకే నడిపించారు. కన్నుపొడుచుకొన్నా కనుపించని ఆ కటికచీకటిలో నోరులేని జీవాలు ఆ గాడిదా, యీ గుర్రం బరువుగా కాలుదీసి కాలువేస్తూ విధిలేక ముందుకు కదిలిపోతున్నాయి. ఆ 'కోట' దగ్గిరపడ్డది. అది దగ్గిర అవుతున్నకొద్దీ డాన్ క్విక్‌సెట్ గారు గుర్రంమీాదనే ఎగిరెగిరి చూస్తున్నాడు. తీరాదగ్గిరకువచ్చి చూస్తే, అది కోటా కాదు; గీటాకాదు. ఒకపెద్ద 'చర్చి.'

ఇది కోటేనని గంపెడు ఆశతోవున్న డాన్ క్విక్‌సెట్ గారికి, అది కోటకాదని తేలేసరికి కొండంత దిగులు ముంచుకువచ్చింది. ఆయనకువున్న మతికాస్తా పోయినట్లే అయింది. ముసలిగుర్రం 'రోజినాన్‌టీ' కంటె మిక్కుటంగా యీా వీరుడే ముట్టెదించేసుకొన్నాడు.

శాంకో పాంజాగాడికి అసలు యీా గొడవ ఏమీా పట్టలేదు; వాడికి ఎంతసేపూ నిద్రమీదే యావ. అందుకని వాడు యీా సమయంచూచుకొని, "అయిన శృంగభంగంచాలు; యికనైనా ఆ కనుపించే చెట్లపొదల్లోకి పోయి, కాస్త కునుకుతీద్దాంరండి. ఈ రెండుమూడుగంటలయినా నిద్రపోతే, తెల్లవారుఝాామునే నేనులేచి వూళ్లోకిపోయి డల్‌సీనియా రాకుమారిగారి రాజసౌధం ఎక్కడవుండేదీ పదిమందినీ అడిగి గాలించుకువస్తాన"ని వాగ్దానం చేశాడు.

డాన్ క్విక్‌సెట్‌గారుకూడా పుట్టెడు దిగులుతోవున్న కారణంచేత, వీడుచేసిన సూచనకు చప్పున ఒప్పుకొన్నాడు. ఇద్దరూ మళ్లీ తమ వాహనాలను వెనక్కు మళ్ళించి, ఆ చెట్లపొదల్లోకి పోయారు. అక్కడచేరీ చేరటంతోటే శాంకోపాంజా గాడిదను తీసుకొనిపోయి ఒకచెట్టుకు కట్టేసి, తానూ అక్కడే కాళ్లు బారజాపి పడుకొని గుర్రుపెట్టి నిద్రిపోయాడు. డాన్ క్విక్‌సెట్‌గారికిమాత్రం ఎంతకీ నిద్దరరాలేదు. అలాగే, డేరామేకులా కూర్చొని, దీర్ఘంగా ఆలోచించాడు. ఆయన ఆలోచనలు ఒకదారికి రాకముందే తొలికోడి కూసింది. తూర్పున తెల్లరేఖలు ఆడాయి.

శాంకో పాంజా గురక ఆగిపోయింది. వాడు లేచికూర్చొని బిగ్గరగా ఆవలించి, "అయితే మరి నేను వూళ్లోకి వెళ్లి ఆవిడగారి భవనం ఎక్కడ వున్నదో వెతికిరానా?" అన్నాడు. "సరిమే. శీఘ్రమే పోయిరమ్మ" అంటూ వాణ్ణి ఆశీర్వదించి పంపాడు డాన్ క్విక్‌సెట్‌గారు. వాడు గాడిదనెక్కి బయలుదేరాడు.

డాన్ క్విక్‌సెట్‌గారి దగ్గిర బంటువుద్యోగానికి ఒప్పుకోక ముందు వాడు అంత మందకొడి మనిషిగా వుండే వాడా! అటువంటి వాడికి కూడా, యీా మధ్య అయిన అనుభవాలను బట్టి, ఎక్కడనుంచి వచ్చిందో, మనిషిలో కొంత చురుకుదనం వచ్చింది. ఇదివరకు ఎవరు ఎంత ఏడిపిస్తున్నా, వీడికేమీా అర్థం అయ్యేది కాదు. అటువంటి వాడికి కూడా యిప్పుడు తన యజమానినే కాస్త ఏడిపిద్దామనే బుద్ధి పుట్టుకొచ్చింది. అందుకని ఒక మంచి పథకం వేశాడు. తన యజమాని యింత కాలం హోటల్‌ని పట్టుకొని కోట అనీ, గొఱ్ఱెలమందును చూపి సైన్య సమూహామనీ, మంగలి బొచ్చెను చూపి నవరత్న ఖచిత సువర్ణ కిరీటమనీ తనను బుకాయింప చూస్తున్నాడుగా. తానూ యీాసారి అలాటిపనే ఒకటి చేద్దామని వీడికి సరదా వేసింది. తన యీా పథకంగనుక పారిందంటే, యికమీాదట డాన్ క్విక్‌సెట్ గారు తనను మాటిమాటికీ యిలా చికాకు పెట్టడనికూడా అనిపించింది.

అందుకని తొలికోడి కూయగానే నిద్దరలేచి

బయలుదేరిన శాంకో పాంజా, డల్‌సినియా రాకుమారి నివాసం వెతకటం మానేసి, ఆ చెట్ల తోపులోనే యింకోక మూలకుపోయి మళ్లీ పడక వేశాడు. సరిగా నడుమువాల్చి వాల్చకముందే పెద్దగా గురకలుపెట్టి నిద్రపోయాడు.

వీడీ వరసను హాయిగా గురకలు పెట్టి నిద్ర పోతూవుంటే, అవతల డాన్ క్విక్‌సెట్‌గారు ఆ చెట్టుకు చేరగిలబడి కూర్చోని, కళ్లు తెరుచుకొనే కలలు కంటున్నాడు. శాంకో పాంజా సరాసరి టొబోసో కోటలోకి పోయినట్లు, డల్‌సీనియా రాకుమారి వాడికి దర్శన మిచ్చినట్లు, 'భీకరానన వీర శూరాగ్రేసరుడు' డాన్ క్విక్‌సెట్‌గారి యోగక్షేమాలను గూర్చి ఆమె తరిచి తరిచి వాడిని అడుగుతున్నట్లు వూహా చిత్రాలు చిత్రించుకొని తెగ మురిసిపోతున్నాడు.

తెల్లవారింది. ప్రొద్దుటి ఎండ బాగా చురుకు ఎక్కింది. అప్పటికిగానీ శాంకో పాంజాకు మెళుకవ రాలేదు. కంగారుగా లేచి కూర్చొన్నాడు కళ్లు తెరిచి చూసేసరికి ఆ చెట్ల తోపుల్లోకి ముగ్గురు పల్లె పడుచులు గాడిదలెక్కి యిటువేపే వస్తున్న దృశ్యం ఒకటి కంటపడింది. ఇక నేం — వెంటనే 'డాపుల్' మూపున ఎక్కి చకాచకా తన యజమాని వద్దకు వెళ్లాడు.

"స్వామీ! ఓ నాస్వామీ! యింకే మాత్రం ఆలస్యం చేయకండి. ఆరోజి నాన్‌టీ జీనూ అది సరి చేసి, చప్పున గుర్రం ఎక్కి-యిలా యీ మైదానం వైపుకు వచ్చేయండి. సాక్షాత్తు ఆ డల్‌సినియా రాకుమారిగారే మిమ్ములను కలుసుకొనేందుకు తామే స్వయంగా, యిద్దరు పూబోడులను వెంటబెట్టుకొని యిటే వచ్చేస్తున్నారు" అంటూ శాంకో పాంజాగాడు పెద్దగోలగా అరిచాడు.

డాన్ క్విక్‌సెట్‌గారు యీ మాటలు వింటూ కూడా మనిషి కదలలేక పోయాడు. ఆ అనన్య రూపసి డల్‌సినియా రాకుమారి తనను చూడటానికి, తానే స్వయంగా వస్తున్నదని శాంకోపాంజా ఎంత నమ్మకంగా చెప్పుతున్నా, ఆయన నమ్మలేక పోతున్నాడు. ఆకస్మాత్తుగా విన్న ఆ సంతోషవార్తను ఆయన సరిగా ఆకళింపు చేసుకోవటానికి బాగా పది, పదిహేను నిముషాలు పట్టింది. ఈయన మాటామంతీ లేకుండా, మనిషి బిగుసుకు పోతూవుంటే, శాంకో పాంజా తన ధోరణి ఆపకుండా "నిజంగా ఆమెగారే యిటు వస్తున్నారండీ. అంతటి అందగత్తెను నేను నా యీ పాపిష్టికళ్లతో యింతకుముందు ఎన్నడూ చూడలేదంటే నమ్మండి. ఆహాహా! ఓహోహో! హిహిహి! ఏమందం! ఏమందం! అరెరె—ఆవిడే కాదు, ఆవిడగారి చెలికత్తెలుకూడా ఎంత అందంగా వున్నారనుకొన్నారూ! అబ్బ! ఆ అందం నేను వర్ణించి చెప్పలేనండి. కంసాలి మూసలో కరిగించిన బంగారం వీళ్లవంటి ఛాయముందు బలాదూర్...ఆఁ... అంతే... పైగా వాళ్లు ఎంత విలువైన బట్టలు కట్టుకొన్నారండీ. అబ్బా! అవన్నీ నికార్సైన పట్టుసరుకే. వాళ్లు పెట్టుకొన్న నగలో! బంగారపు తొడుగులే తొడుకొన్నారండీ. వాటినిండా వజ్రవైఢూర్యాలూ మిల మిలా మెరిసిపోతున్నాయి. ఈ నీరెండలో వాటి మెరుపు చూసేసరికి నాకళ్లు చీకట్లు క్రమ్మేశాయి. విరబోసుకొన్న వాళ్లజుట్టు పిల్లగాలికి వింత వింత నృత్యాలు చేస్తూ ఎంత మనోహరంగా వున్నదనుకొన్నారూ? ఇన్ని మాటలెందుకండీ! నాకంటికి వాళ్లు కాంతికిరణాలలా కనిపించారంటే మీరు నమ్మి తీరాలి. వాళ్లు ఎక్కివస్తున్న వాహనాలైనా ఎటువంటివి? ఫక్తు నిత్యకళ్యాణులు!"

ఇప్పటికి డాన్ క్విక్‌సెట్‌గారు కొంచెంగా తేరుకొని, వాడి మాటలకు అడ్డువచ్చి "నిత్యకళ్యాణులేమిటి? పంచకళ్యాణులు కాబోలును" అన్నాడు.

"నిత్యకళ్యాణో, పంచకళ్యాణో. ఏదైతే ఏమండీ! ఆ రెంటికీ పెద్ద చెప్పుకోదగిన వ్యత్యాసం ఏమీలేదు... ఏమైనా, మీరుమాత్రం వెంటనే మీ ముసలిగుర్రాన్ని ఎక్కి కూర్చోండి" అంటూ శాంకో పాంజా ఆయనను తెగ తొందరచేశాడు. "ఇక క్షణమైనా ఆలస్యం చేశారంటే డల్‌సీనియా రాకుమారిని కలుసుకొనే అదృష్టం పీసమంత వాసిలో తప్పిపోతుంద"ని కూడా హెచ్చరించాడు.

ఇకనేం—యిద్దరూ ఆ చెట్లతోపుకు అడ్డం పడ్డారు. కొద్ది నిముషాలలోనే ఆ ముగ్గురు వనితలూ వీళ్లకంటపడ్డారు. శాంకో పాంజా సంబరాలు పడుతూ, "అరుగో; అరుగో! వాళ్లే. ఆ వస్తున్నవాళ్ళే" అంటూ లొట్టలువేశాడు.

డాన్ క్విక్ సెట్ గారు మాత్రం నీరుకారిపోయాడు. వాడు అంతగొప్పగా వర్ణించి చెప్పిన దానికి, యిప్పుడు తనకళ్ళతో చూస్తున్న దానికీ ఎక్కడా పోలికేలేకుండా పోయిందామెను! ఎవరు మాత్రం మరేంచేస్తారు; నీరుకారిపోకుండా! ఎట్లాగో గొంతు పెకలించుకొని "శాంకో! నీవు వర్ణించిన ఆ అందాలభరిణెలు, ఆ పట్టుపీతాంబరములు, ఆ వజ్ర వైఢూర్యములు, ఆ పంచకళ్యాణులు, వీనిలో ఏఒక్క వస్తువునూ నాకంటికి అగుపించుట లేదేలనోయీ! నాకట్టెదుర కనుపించువారు ముగ్గురు సాధారణ స్త్రీ మూర్తులు. పైగా వారు ఎక్కివచ్చుచున్నవి అశ్వములైనను కావే? అవి కేవలము గార్ధభముల వలె తోచెడినే!" అంటూ ఆశ్చర్యం వెళ్ల పెట్టాడు.



ఈమాటలు వినటంతోటే నమ్మరానివిషయం ఏదో జరుగుతున్నంత యిదిగా మొఖకవళికలన్నీ మార్చేసి, శాంకోపాంజా "ఏమన్నారూ! అయితే మీకు నిత్యకళ్యాణి .. కాదుకాదు పంచకళ్యాణి.. నెక్కి వస్తున్న డల్ సినియా రాకుమారిగారే కనుపించటం లేదంటారా!" అని అడిగాడు. అంటూనే ఆ ముగ్గురు పడుచుపిల్లల్లో ఒకామెకు దగ్గిరగాపోయి, ఆమె ఎక్కివున్నగాడిద కళ్ళేన్ని పట్టుకొన్నాడు. ఆ గాడిద ఠక్కున ఆగిపోయింది. శాంకో పాంజాగాడు ఆమె పాదాల దగ్గిర మోకరిల్లి "ఓ డల్ సీనియా రాకుమారీ! ఈ 'భీకరానన వీరశూరాగ్రేసరుడు' డాన్ క్విక్ సెట్ గారూ, ఆయన అనుంగు భృత్యుడు శాంకో పాంజానైన నేనూ, మీ దివ్యపాద పద్మములసన్నిధికి వచ్చివున్నాం. మాపై మీకటాక్ష వీక్షణాలు ప్రసరించనీయండి." అంటూ బ్రతిమలాడడం మొదలు పెట్టాడు. ఈలోగా డాన్ క్విక్ సెట్ గారు కూడా ఆ చోటికివచ్చి, తనూ ఆమెపాదాలవద్ద మోకరిల్లాడు. అలా మోకరిల్లాడన్నమాటే కానీ, ఆయన మొఖం మాత్రం ఏదో అనుమానంతో బాధపడుతున్నట్లే ముడుచుకుపోయి వున్నది.

వీళ్లిద్దరి తీరు యిలా వుంటే, ఆగాడిదమీద ఎక్కివున్న భామ యీస భాష లకించుకొని "ఇదేంది! ఎక్కడి మడుసులు మీరు? గాడిద కాళ్లకు అడ్డొత్తారేం? లెగండి; లెగండెహె" అంటూ కోపంగా తిట్లు గుమ్మరించింది. నోరువిప్పి మాట్లాడేంత వరకూ యీవిడ నిజంగానే డల్ సినియా రాకుమారేమోననే అనుమానం డాన్ క్విక్ సెట్ గారి బుర్రలో ఒకమూల మెదులుతునే వున్నది. అది కాస్తా, యీ తిట్లతో తుడిచి పెట్టుకుపోయింది. శాంకో పాంజా వైపుకు తిరిగి "చూచితవా శాంకో! లోగడ మన వీర విహారములందు ఏమాంత్రికుడు మనలను పరాభవించెనో, ఆ మాంత్రికుడు యింకనూ మనలను వీడకయున్నాడు కదా! ఆమాంత్రికు డెవ్వడో కాని, మన పంచేంద్రియముల నీతెరగున బంధించి మనల మోసగించుచున్నాడు. ఆ అందాలరాసి ఆ ముత్యాల కోవ, డల్ సీనియా రాకుమారిని చూడవలసిన యీ కన్నులకు, యీ మొగనాలి కనిపించుచున్నదన్న, యిది అంతయూ ఆ మాంత్రికుని ప్రభావమే కదా! ఇందిసుమంతయు సందియము లేదు." అంటూ తెగ నిట్టూర్పులు విడిచాడు.

వీళ్ల ధోరణి చూస్తున్న కొద్దీ ఆ పల్లెపడుచుకు పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వు వచ్చింది. "సీ యీధి భాగోతం ఏశాలుమాని మినకుండవయ్యా! మొగాడా" అంటూ వీళ్లని విదిలించి పారేసి, గాడిద డొక్కలో ముల్లుకర్రతో పొడిచింది. ఆముల్లుపోటుతో ఆగాడిదకు ఎక్కడలేని కోపం వచ్చేసింది. కోపం కొద్దీ అది తెగ గంతేసింది. హద్దుమీరి ఆగాడిద వేసిన గంతులకు, పాపం, ఆపడుచు క్రిందపడి పోయింది.

ఈవిడే డల్సినియా రాకుమారి ఏమో అని యింత సేపూ అనుకొంటూ వున్న డాన్ క్విక్ సెట్ గారికి యీవిడ పాటును చూస్తుంటే, బాధ పుట్టుకొచ్చింది. ఇక మరేమీ ఆలోచన లేకుండా దబదబా ఆవిడ పడివున్న చోటికి పరుగెత్తుకొంటూ పోయాడు. ఈయన అంత హడావుడి పడి పరిగెత్తటమైతే పరిగెత్తాడు కానీ, ఆపడుచు ఎవరి సహాయం అక్కర లేకుండానే, క్రిందపడ్డ మనిషి మళ్లీ లేచినిల్చొని, చేతికందకుండా పరుగెత్తాలని చూస్తున్న గాడిద తాలూకు రెండుచెవులూ రెండు చేతులతోనూ పట్టేసుకొని, కసికొద్దీ దాని ముట్టెను నేలకేసి బాది, దానికి బుద్ధివచ్చిందని తోచాక, దాని వీపుమీద ఎక్కి కూర్చొని ముందుకు ప్రయాణం కూడా సాగించేసింది. తన సావాసగత్తెల నిద్దరినీ కలుసుకొన్నది. ముగ్గురూకలిసి పగలబడినవ్వుకొంటూ, మాటి మాటికి వెనక్కి తిరిగిచూసి వీళ్లను వెక్కిరిస్తూ, వాళ్లదారిని వాళ్లు వెళ్లిపోయారు.

'భీకరానన వీరశూరాగ్రేసరుడు' డాన్ క్విక్ సెట్ గారు డల్సీనియా రాకుమారిని కలుసుకొనేఘట్టం యీ తీరుగా ముగిసిపోయింది. నిజంగానే డల్సీనియా రాకుమారి తన ఎదుటకువస్తే, ఆమెను తనకన్నులారచూడనీయకుండా చేసిన ఆ మాంత్రికుని తెగ తిట్టుకొంటూ డాన్ క్విక్ సెట్ గారు, మొఖం వేలవేసుకొని 'సారగొస్సా' ప్రాంతంవైపుకు గుర్రాన్ని పోనిచ్చాడు. శాంకో పాంజాపైకి ఎంత దిగులుగావున్నట్లు కనుపిస్తున్నా, లోపలలోపల మాత్రం తన యజమానికి జరిగిన శృంగభంగానికి తెగమురిసిపోతున్నాడు.

(ఇంకావుంది)

# పేరులో ఏముంది?

పేరులేకుండా ఏమనిషీ ఉండడు. మనిషికి ఉండే పేరునుబట్టే అతను 'ఫలానా' అని గుర్తుపట్తాము. మన తెలుగువాళ్ళలో పుట్టిన బిడ్డకు బాలసారె రోజున నామకరణం సాధారణంగా జరుగుతుంది. బిడ్డకు తమ తాతల పేర్లో తమ తండ్రులు, మామ్మల పేర్లో తల్లులపేర్లో, తల్లిదండ్రులు పెట్టనిశ్చయిస్తారు. కొందరు దేవుళ్ళ పేర్లు పెడతారు. శాస్త్రి, శర్మ పంతులు, సిద్ధాంతి మొదలైనవి బ్రాహ్మణులకోసం ప్రత్యేకించబడినై. సుబ్బారావు, సూర్యనారాయణ, సత్యనారాయణ, కృష్ణమూర్తి, రామారావు, సీత, సత్యవతి సావిత్రి, సుబ్బమ్మ మొదలైన పేర్లు ప్రతి తెలుగు కుటుంబంలోనూ డజన్లకొద్దిమందికి వుంటాయి.

పెంపుడు కుక్కలకి ముద్దుగా 'టామీ' అనో, 'జానీ' అనో పేర్లు పెట్టడంకూడ వుంది. కొన్ని ఇళ్లలో ఆవులకుకూడ ఏవేవో పేర్లు పెట్టి పిలవడం కద్దు. నామకరణం చేసేటప్పుడు ఏపేరు పెట్టినా ఇంట్లో వాళ్లు ఆపేరుతో పిలవక, 'చిట్టీ' అనో, 'చంటీ'అనో,'బాబీ' అనో, అసలు పేరును కుదించి పిలవడం జరుగుతూంటుంది సాధారణంగా.

కాలేజీల్లోనూ, హైస్కూళ్ళలోనూ చదివే ఆడపిల్లలకి మగపిల్లలు, ఎంతటి మంచిపేర్లున్నా ఇట్టే తీసివేసి, ఏ ఇంగ్లీషు సినిమాతారపేరో హిందీసినిమాతారపేరో తగిలిస్తూంటారు. తేకపోతే ఆ అమ్మాయి వాళ్ళ దృష్టిలో ఎట్లా కనబడిందో ఆపేరు ఒకటి సృష్టించి తగిలిస్తారు.

ఇక ఉపాధ్యాయులకీ, అధ్యాపకులకీ కూడ అంతే – ఫలానా లెక్చరర్ పేరు చెబితే కుర్రవాళ్ళకి తెలియదు-కుర్రవాళ్ళ పరిభాషలో ఆ లెక్చరర్‌కు ఏంపేరుందో తెలియాలి. ఇక, కుర్రవాళ్లకికూడ పెద్దపెద్ద పేర్లు ఉండటంతో పూర్తి పేరుతో పిలవలేక స్నేహితులు పేరులో ఏచిన్న, 'సూర్య' అనేదో తీసికొని 'సూర్యం' అనో, 'సత్య' తీసికొని 'సత్యం' అనో పిలవడం జరుగుతున్నది.

పిలిచే పేరుకీ, ఆ వ్యక్తియొక్క ప్రవర్తన, స్వరూప స్వభావాలకి ఎక్కడా సంబంధం వుండదు- పెట్టిన పేరు 'ఫలాన' వ్యక్తి గుణగణాలను నిర్ణయించలేకపోతున్నది-అట్లాగే ఒక కథకాని ఒక వ్యాసం కాని వ్రాస్తే దానికి ఉచితమైన పేరు (హెడ్డింగ్) పెట్టితేనే అది ఆకర్షణీయంగా ఆమోదనీయంగా వున్నట్లైతే, వెంటనే చదవ నారంభిస్తారు.

ఈమధ్య రచయితలు అనుకరించటంలో పడిపోయి 'శ్రీ'లుగల పేర్లు, మారుపేర్లు, స్త్రీల పేర్లతో పత్రికలలో వ్యవహరించబడుతున్నవి-తారలతారాలు పెట[illegible]కుల పేర్లను పెట్టటం తగ్గిపోయింది. ఇది సినిమాయుగం కనక, అతినాజూకైన పేర్లు ప్రారంభమౌతున్నవి.

కొత్త పత్రిక పెట్టేవాళ్ళు అంతక్రితం ఎవరూ పెట్టనిది, చిన్నది, నాజూకైనది, ప్రజల్లో బాగా పనిచేయగలిగేదీ, సాహిత్యదృష్టిలో విలువైనదీ అయిన పేరుకోసం తడుముల్లాడుకుంటారు. సినిమాలవాళ్లుకూడ ఒక పద్ధతిలోపడి మనకు చూపబోయే కథకీ వాళ్లు పెట్టే పేరుకూ సంబంధం లేకుండా చేస్తున్నారు. పేరునుబట్టి స్త్రీయో, పురుషుడో నిర్ణయించగలం. కాని కొందరు స్త్రీలకు పురుషనామం ఉండటం, కొందరు పురుషులకు స్త్రీనామం ఉండటం ఉ॥ మహాలక్ష్మి

(38-వ పేజీ చూడండి)

శ్రీ చామర్తి కనకయ్య

# అందని పళ్లు

శ్రీ తిప్పావఝుల వెంకట్రామయ్య

ఆవి నేను వీధిబడిలో చదివే రోజులు. పదేళ్లుంటాయి. గోపాలం నాకు ప్రాణస్నేహితుడు. మాయిద్దరిదీ ఒకేయీడు. అల్లరిలో మాది పెట్టింది పేరు. ప్రతితోట కాపలా వాడికీ మేమంటే హడల్! మా గ్రామంలో ఎక్కువగా మామిడి తోటలుండేవిలెండి! ఎన్నిరకములు మామిడి పండ్లుండేవో; వేటి వేటి రుచులు ఎలావుంటాయో మాకు తెలిసినట్లు వేఱొకరికి తెలియదంటే నమ్మండి.

ఆ ఏడాది వసంతం గడచిపోతున్నది. బంగారు పోతబోసినట్లు అగుపిస్తూ మామిడిపండ్లు చూపరుల నోరూరిస్తున్నాయి. చాలా తోటలలోపండ్లు మాచేత రుచి చూడబడే అదృష్టాన్ని పొందాయి-కానీ, ఒక్కతోటమాత్రం మాకు చొరరానికోట అయింది.

అది రామారావుగారితోట. ఆయన లక్షాధికారి. రకరకాలైన చెట్లున్నాయి ఆయనగారితోటలో. ఆ తోటకు కాపలాదారు రామయ్య తాత. కాపలావాళ్లందర్నీ మోసగించిన మా తెలివితేటలన్నీ అతనిదగ్గర ఎందుకూ కొరగాకుండాపోయాయి. అతడిది వింత ప్రకృతి. అసలు నిద్రేరాదేమో! శబ్దాన్నిబట్టే పసిగట్టేసేవాడు.

ఆ తోటలో మంచి చెట్టొకటుండేది. అది మేలైనది. రామారావుగారి కుటుంబానికి ప్రత్యేకింపబడ్డది. ఆ పండ్లు చెట్టునే పండించేవారు. దానిక్రిందే రామయ్యతాత మంచం. పిట్టనైనా వాలనిచ్చేవాడుగాడు.

ఎండలో తళతళ మెరిసే ఆ పండ్లను చూస్తుంటే మానోరు మహా వూరేది. పాము తలమీది మణిలాగా, ఆపళ్లు మాకు అందరానివి అయినాయి. అయినా కూడా మా ప్రయత్నాలు మేము మానలేదు.

ఒకనాడు మధ్యాహ్నం బడి వదలగానే బయలుదేరాం. ఈరోజు ఎట్లాగైనా సరే రామయ్య తాతను కన్నుగప్పి మామిడి పండ్లు కొట్టెయ్యాలి అని పంతం పట్టాం. తోట వద్దకు వచ్చిచూస్తే మా అదృష్టం కొద్దీ రామయ్య తాత కునుకుతున్నాడు; గేటుకులోపల తాళం వేసుకొని. ఆ అదనుకనిపెట్టి చల్లగా ద్వారానికి కొంచెం అటుప్రక్క కంప అటు యిటు కదిలించి, పీకి పారేసి, బాగా మనిషి దూరేంత సందు చేశాం. చప్పుడు చెయ్యకుండా తోటలో దూరాం; ఒకరి వెంట ఒకరం. ఎండుటాకులగలగలలు మా ప్రాణానికి మేఘగర్జనల్లా ఉన్నాయ్. మా గుండెల్లో రైళ్లు పరుగెత్తుతున్నాయి.

చల్లగా చెట్టువద్దకు చేరాం. గోపాలంచెట్టెక్కాడు. నాదృష్టులన్నీ రామయ్య తాతమీదనే కేంద్రీకరించాను. ఈలోపల గోపాలం రెండు పండ్లుకోసి జేబుల్లో దోపేసి గుట్టు చప్పుడు కాకుండా చెట్టుదిగి వచ్చాడు. ఇద్దరం అడుగుల్లో అడుగులు వేసుకొంటూ కంచె దగ్గఱకు చేరాము. ముందుగా నేను దూరి యీవతలకు వొచ్చేశాను.

మా దురదృష్ట దేవత శక్తి రూపంలోపోయి నిద్రపోతున్న రామయ్య తాతను లేపిందేమో! అతగాడు యింతలావు దుడ్డుకఱ్ఱ చేత్తో పట్టుకు మా వెనకాల పరుగు మొదలు పెట్టాడు.

మావాడు తొందరలో ముల్లు త్రొక్కాడు. వెనుక వస్తుండే దండధరుడి భయానికి తోడు, యీ ముల్లుబాధ ఒకటి వచ్చిపడే సరికి వాడు ఒక్క గావుకేక పెట్టి కూలబడి పోయాడు. రామయ్య తాత తొక్కత్రొక్కిన త్రాచల్లే బుసలు కొట్టుతూ ముందుకు వస్తున్నాడు. బాగా చెయ్యివాటు దూరంలోకి వచ్చాక గోపాలం మీదికి చెయ్యెత్తాడు. నాకు కళ్లనీళ్ల పర్యంతమైంది; గోపాలం పరిస్థితిచూచి. కొంచెమటుపోయి ఒక యిటుక ముక్క తీసి, చేతికొద్దీ విసిరాను. మరి మా అదృష్టమే పండిందో, లేక గతకాలములో మేము చేసిన అభ్యాస ఫలితమో, ఆయిటిక ముక్కపోయి రామయ్య తాత నడ్డికి తగిలింది. "ఎవ్రడా వాడు"! అని దెబ్బదిన్న పులిలా గాండ్రిస్తూ నావైపు పరుగెత్తాడు.

ఈలోపల ముల్లుబాధ ఎటు

పోయిందో, గోపాలం పాములా చరచర ప్రాకి వెలుపలికొచ్చేశాడు. కంచె యీవలనున్న నన్నేమీ చేయలేకపోయాడు ముసిలాడు. పండ్లు పటపట కొఱకడం మాత్రం చూశాను. మొత్తంమీద యిద్దరమూ తప్పించుకొన్నాము. రామయ్య తాత తాళం దీసి యీవలికొచ్చేలోగా మేము ఒక ఫర్లాంగు దూరమైనా పరుగెత్తగలం. ఇద్దరం చెఱొక పండు చేతబట్టుకొని, పరుగు పందెం మొదలెట్టాం.

మహా వేగంగా పరుగెడుతూ, నూరు గజముల దూరంలో వున్న డొంక మలుపు తిరిగాము. మా కాళ్లల్లో రక్తం గడ్డగట్టి పోయింది. అక్కడ కంటబడిన ఆ దృశ్యం చూసి మా గుండెలు కొట్టుకోవటం ఒక్కసారిగా ఆగిపోయినంత పని అయింది. మొహాలు పాలిపోయాయి. ఎదురుగా తోటయజమాని రామారావు గారు వస్తున్నారు! ఆయన మా ఉధృతం చూచి ఆగారు. వెనుక రామయ్య తాత తాళం తీసి పరిగెత్తుకు వచ్చాడు. "వెనుక నుయ్యి, ముందు గొయ్యి" అన్న సామెత అక్షరాలా నిజమైంది మాయందు. నిశ్చేష్టులమై నిలబడి పోయాము.

రామయ్య తాత రెండు చేతులతోనూ మా యిద్దరి రెట్టలు పట్టుకొని, మెలివేయ సాగాడు. "నన్ను మోసగిస్తా రట్రా", అని గర్జించాడు. రామారావు గారు "రామయ్యా వాళ్లని వదిలెయ్" ఒక అరుపు అరిచి "సంగతేమిటని" ప్రశ్నించారు. రామయ్య తాత విషయమంతా వివరించి చెప్పి "దొరికారండీ, తోడు దొంగ లిద్దరూను" అన్నాడు. "నాకన్నె కప్పేసి ఆ చెట్టుకాయలే కోశారండీ !" అంటూ మామీద మహా గొప్పగా ఫిర్యాదు చేశాడు తన యజమానితో.

రామారావుగారు "సరే లే ! నీవుపో!" అని మాయిరువురి భుజాలపైనా చేతులు వేసి, మెల్లగా తోటలోకి నడిపించుకపోయారు. ఆయన ముఖంలో మాంచి గంభీర్యం, ప్రశాంతత కొట్టవచ్చినట్లు కనుపిస్తున్నాయి.

దీని పరిణామ మేమౌతుందోనని బిక్కు బిక్కు మంటూ ఆయన వెంట నడిచాము. రామారావు గారు రామయ్యచేత కొన్ని పళ్లు కోయించి చెఱినాలుగేసియిచ్చారు. మా హృదయాలప్పటికే ద్రవీభూతములై పోతున్నాయి. అప్రయత్నంగానే మా కళ్లవెంట జోట జోట కన్నీటి బిందువులు కారిపోతున్నాయి.

రామారావు గారు చిరునవ్వుతో "ఏమిరా ! ఇవి చాలునా ! ఇంకా కావాలా ? మీకు కావలసి ఉంటే నన్నడగండి. అంతే కాని, యిలాంటి ప్రమాదకరమైన పనులు చేయకండి ! దొంగతనం చెయ్యబోతే ముల్లు గుచ్చుకోవడం,

(39-వ పేజీ చూడండి)



## ులో ఏముంది

(35-వ పేజీ తరువాయి)

(పురుషుడు) అనీ, సుబ్బారావు (స్త్రీ) అనీ ఉంచటం మనం అప్పుడప్పుడు చూస్తూంటాం - ఇట్లాంటి పేర్లకు ముందు (శ్రీ), (శ్రీ)మతులు లేకపోతే జోల్తాపడటం తప్పదు.

ఈ మధ్య క్రొత్తపేర్లు ఎన్నో విన్నాను. ఒకబ్బాయి పేరు 'ఏసు కృష్ణ'ట-ఒకమ్మాయి పేరు 'లిడియా భారతి'. ఇంకా 'ఛార్లెట్ సుశీల'- వంటివి-మనలో కొందరు పిల్లలకు 'బాబ్జీ' అనేది అసలు పేరుకు చేరుస్తూంటారు.

పేరునుబట్టి మనం వ్యక్తిని ఏదేశంవాడో ఊహించుకోగలం-ఉదా॥ ఛటర్జీ, ముఖర్జీలు బెంగాలీలనీ, అయ్యర్, మీనన్, చెట్టి,పిళ్ళె మొదలియార్లు దక్షిణాదివాళ్లనీ, 'సింగ్' అంటే పంజాబీవాడనీ, ఇల్లా ఎన్నో విధాలైన విశిష్టమైన పేర్లు కలవాళ్లను మనం దగ్గరగా పోల్చుకోగలుగుతున్నాం.

ఇక విదేశాలసంగతి చూద్దాం: స్మిత్, బ్రౌన్, జోన్, రాబిన్‌సన్ వంటి పేర్లతో మనకేం పేచీలేదు. వాళ్లు మిలియన్లకొద్దీ ఉంటారు. చిక్కు- ఎక్కడా అంటే, పేర్లు చాలా విలక్షణంగా ఉన్నప్పుడే- ఉదా॥ ఇండియానాలో ఉండే ఒక అమెరికన్ పేరు—

"*SCHEALLEANGPSC HEALL EANGSTAN DZIANXEB WIES-TINZE*" అతను మిస్. బ్రిట్ అనే ఆమెను వివాహం మాడాడు. ఆమె తన పేరు 75 అక్షరాలు వచ్చే పెద్ద పేరుగా మార్చుకున్నది కొన్ని సంవత్సరాలక్రితం ప్యూరిటన్ క్రైస్తవులు తమ మతప్రచారానికి బైబిలు పుస్తకాలు ఇస్తూ వింతగా పేర్లుపెట్టిపిలుస్తూండే వారు. ఉదా॥ *Sorry-for-Sin, Rest-in-the-Lord; Safe-on-High, Praise-God* వంటివి.

కొందరి ఇంటిపేర్లు వాళ్ల యజమానులను బట్టి వస్తూండేవి-ఉదా॥ పార్టు, లాంగ్ ఫెలో, మిల్లర్, కుక్, బేకర్-వంటివి. క్రీ-శ 100 సంవత్సరం తర్వాతనుండి ఆపైపేర్లు వంశానుగతంగా వస్తున్నవి.

చైనా అంతటిలోనూ 400 ఇంటి పేర్లు మాత్రమే వున్నాయి. స్కూలు పిల్లలు వాని నన్నింటిని కంఠస్థం

చేయవలసివుంటుంది. అందులో 'ఛాంగ్'లూ 'వాంగ్'లూ తలో 25 మిలియన్లు ఉంటారు - అమెరికాలోని 'ఓక్లా' పట్టణంలో 'జాక్సన్' తన ముగ్గురు పిల్లలను కొన్ని రోగాల పేర్లతో పిలుస్తాడు-ఉదా॥ టాన్సిలిటిస్, మెనింజిటిస్, ఎప్పెండిసిటిస్—

ఇంకా చిత్రమైన పేర్లు ఉన్నాయి — ఒకతనిపేరు 'హార్డీ స్పేరో',(*Hardy Sparrow*) - అతను చెట్టుమీదనుండి పడి దెబ్బలు తిన్నాడు. 'స్పియర్' అనే కుర్రాడిని తండ్రి ముద్దుగా 'షేక్' అని పిలుస్తూండేవాడుట. కర్రీ, రైస్, అనే ఇద్దరు క్రికెట్ కెప్టెన్‌లు; బ్లడ్ (*Blood*) స్లాటర్ (*Slaughter*), డెత్ (*Death*) అనే ముగ్గురు డాక్టర్లు; (*B. Proper*) బి. ప్రోపర్ అనే సారా దుకాణదారు; 'వెల్షవిలేజీ' బడిలో ఒకే తరగతిలో ముగ్గురు విద్యార్థులు లాఫెన్, స్మైలెన్; క్రైయన్, అనే వాళ్లు ఉండేవారు.

1897లో 'విక్టర్లూ' 'విక్టోరియను'లూ ఎక్కువమంది ఉండేవారు కొంతకాలం 'గోర్డాన్‌లు' స్టాన్లీలూ పెరిగిపోయారు. యుద్ధం తర్వాత 'విన్‌స్టన్'లూ 'బెర్నార్డు'లూ, 'వైట్'లూ పెరిగి వుండాలి నిజానికి-'ఆర్నాల్డు' 'సిసిల్' అనేవి ఇంటిపేర్లుగా మారిపోతున్నవి, పాశ్చాత్య దేశాల్లో - ఇట్లా మనం ఎన్ని ఎంటలు చూపించవచ్చు.

"పేరులో ఏముంది పెన్నిధి?" అంటే పేరులోనే ఎంత పెన్నిధి లేకపోతే-—ఏదో ఒక పేరుతో సరిపెట్టుకోలేక—పేరుకోసం యింత పరవళ్లు వుంటాయి - యీ ప్రపంచంలో! ★



## అందని పళ్లు

(37-వ పేజీ తరువాయి)

రామయ్యచేత దెబ్బలు తినవలసిరావటం, ఎన్ని కష్టాలున్నాయో చూచారా? గడుగ్గాయిలు గాబట్టి తప్పించుకొన్నారు. రామయ్య చేతిదెబ్బ తింటే మళ్లీ లేచేవాళ్లేనా ? ఇక పోండి !" అన్నారు సాదరంగా.

"ఇక యిలాటి పనులు చేయమండీ !" అన్నాము వణుకుతున్న కంఠాలతో. ఆయన మా వీపులపై తట్టుతూ "మేమూ మా చిన్నతనంలో మీ మాదిరిగానే అల్లరి చేసేవాళ్లం ! ఇలాటి వెన్ని అల్లర్లు చేశామో! కాని అవి ప్రమాదకరం !" అంటూ మమ్మల్ని గేటుదాకా నడిపించుకు వచ్చి, అక్కడ వొదిలేసి తాను లోపలికెళ్ళి పోయారు.

ఆనాడు మా హృదయాలు పశ్చాత్తాపంతో కుమిలిపోయాయి. ఆనాటితో మా దొంగతనాలకు స్వస్తి చెప్పాం. నూర్గురు రామయ్యలు దుడ్డు కర్రలతో సాధింపలేనిది, రామారావు గారు ఒక్కరు ప్రేమతో సాధించారు. ★

# రెండు మహానగరాలు

(24-వ పేజీ తరువాయి)

న్నాడు. ఏదో చదువుకుంటూనో వ్రాసుకుంటూనో కిటికీదగ్గిర కుర్చీలో కాలక్షేపం చేస్తున్నాడు.

ఆ మొదటినాడు, డాక్టర్ మానెట్ తినటానికి యెదట పెట్టిందేదో తినేసి, పనిలో కూర్చుని వంచినతల ఎత్తకుండా చెప్పులు కుట్టేస్తున్నాడు. చీకటిబడి కళ్లు కనుపించకుండా పోయే దాకా కూడా అలా కుడుతూనే వున్నాడు. కళ్లు కనిపించక చేతిలోవున్న పనిముట్లు పక్కకి పెట్టివెయ్యంగానే లారీ కుర్చీలోనుంచి లేచొచ్చి :

'అలా! బయటికి వెడదామా' అన్నాడు.

'బయటికా ?'— డాక్టర్ అయోమయంగా గొణుక్కున్నాడు. తల అరచేతుల్లోకి దించేసుకుని జుట్టు పీక్కుంటున్నాడు.

ఆ రాత్రి తెలవార్లూ, లారీ కొంతసేపూ, మిస్ ప్రాస్ కొంతసేపూ వంతులమీద మేలుకునుండి ఆయన్ని కనిపెడుతున్నారు. డాక్టరు గదిలో ఇటూ అటూ కొంచెంసేపు మందకొడిగా పచార్లుచేసిపోయి పక్క మీద పడుకుని నిద్రపోయాడు. మళ్లీ ఉదయమే లేచి చెప్పులు ముందేసుకు కూర్చున్నాడు.

రెండోనాడు కూడా సరీగా అలానే జరిగింది. ఆ సాయంత్రం క్రిందటిరోజు మోస్తరుగానే, లారీ 'షికారు వెడదామా' అని అడిగి డాక్టర్ నుంచి సమాధానం యేమీ రాకపోవటం గమనించి, తానొక్కడే వెడుతున్నట్టు నటించి జోరుగా బయటికి వెళ్ళిపోయాడు. మళ్ళీ ఒక గంటకల్లా తిరిగివచ్చి చూస్తే డాక్టర్ కిటికీనగ్గిర నిల్చుని, కిటికీలోనుంచి దొడ్లోవున్న చెట్టు వంక దిగులుగా తొంగిచూస్తున్నాడు. లారీ లోపలికి వచ్చిన అలికిడి తగలగానే నెమ్మదిగా పిల్లికూనలా కదిలి చెప్పులు కుట్టుకునే బెంచీదగ్గిరికి వెళ్లిపోయాడు.

రోజులు నెమ్మదిగా గడిచిపోతున్నయ్. నానాటికి పరిస్థితి మరింత దిగజారిపోతున్నట్టు లారీకి తోచింది.

మూడోరోజు గడిచింది. నాలుగూ, అయిదూ, ఆరూ, ఏడు, ఎనిమిది, తొమ్మిగి రోజులు గడిచిపోయినై.

లారీ, ఈ పరిస్థితినిమాత్రం లూసీకి తెలియనియ్యకుండా అతి భద్రంగా కాపాడగలిగాడు. తొమ్మిదోనాడు సాయంత్రం మాత్రం డాక్టర్ పనిచేయటంలో లారీ ఒక సంగతి గమనించాడు. ఆ పనిని అతి తొందరతొందరగా ముగించాలనే ఆందోళన ఆయన వ్రేళ్ళలో కనుపించుతోంది.

## 27

ఆ తొమ్మిది రోజులూ, అలా, పగలూ రాత్రీ అనకుండా, కంట్లో వత్తులు వేసుకొని, అమితాందోళనగా, కనుపెట్టుకు కూర్చోవటంతో లారీ, బాగా బడలిపోయాడు. గాఢంగా నిద్ర బట్టిపోయింది. పదోనాడు ఉదయం, కిటికీలోనుంచి సూర్యరశ్మి ముఖంమీద పడటంతో త్రుళ్లిపడి నిద్రలేచాడు.

లారీ కళ్లు నలుపుకుంటూ మత్తు వదిలించుకోవటానికి ప్రయత్నించుతున్నాడే గాని, యింకా నిద్రావస్థలో వున్నానా, మేలుకుని వున్నానా అనే సందిగ్ధావస్థలోనే వున్నాడు. కారణమేమిటంటే : డాక్టర్ గదిగుమ్మంలోకి వెళ్లి తొంగిచూసేసరికి అతనికి చాలా ఆశ్చర్యం కలిగింది. చెప్పులుకుట్టే సామాన్లు వగైరా యావత్తూ పెడగా సర్దేసి వున్నయ్ డాక్టర్ తను మామూలుగా ఉదయంపూట వేసుకునే దుస్తులతో, కిటికీకి ప్రక్కగా వున్న



ఒకడు: "కళ్లజోడు పెట్టుకురావటం మరచిపోయాను. నాకు మీరు చెప్పేవి ఏమీ వినిపించటంలేదు.

ఇంకొకడు: "నేను టోపీ పెట్టుకురావటం మరచిపోయాను మీరు చెప్పేది ఒక్క ముక్కకూడా బుర్రకెక్కటంలేదు."

కుర్చీలో నిమ్మకు నీరెత్తినట్టు హాయిగా కూర్చుని చదువుకుంటున్నాడు.

లారీకి, యిప్పుడు తాను మేలుకునేవున్నట్టు ఘట్టినమ్మకమేకలిగినా, ఇన్నినాళ్ళుగా డాక్టరు చెప్పులు కుట్టుకుంటూ కూర్చున్నట్టు తనకు కనిపించిన ఆ దృశ్యమంతా తనకు నిద్రలో సంభవించిన పీడకలేమోననే అనుమానం కలిగింది. అవును మరి నిన్నటి రాత్రి ప్రొద్దుపోయే వరకూ అంతఅయోమయావస్థలో కనుపించిన డాక్టరు తెల్లవారేసరికి ఆ చిహ్నాలు లవలేశమైనా లేకుండా రీగ్గా చదువుకుంటూ, కళ్ళెదుట కనుపించుతుంటే యేమనుకోవాలి?

కాని ఆ సందేహం మరుక్షణంలోనే తీరిపోయింది. ఏమంటే : అలాంటి సంఘటన వాస్తవంగా జరిగివుండకపోయినట్లయితే, టెల్సన్సు బ్యాంకులో సదమదమవుతూ ఊపిరి సలపకుండా ఉక్కిరిబిక్కిరౌతూవుండే లారీ అనే తాను, డాక్టర్ యింటికి వచ్చి, కట్టుకున్న గుడ్డలన్నా విప్పకుండా సోఫాలో పడుకుని నిద్రపోవలసిన అవసరం ఎందుకు గలుగుతుంది; తూరుపు తెల్లవారుతుండగానే, డాక్టర్ గదిగుమ్మంలో నిల్చుని, ఇలాంటి మథనలో పడవలసిన అవసరం ఎందుకు కలుగుతుంది?

ఇంతలోనే మిస్ ప్రాస్ గుబగుబలాడుతూ పరుగెత్తుకొచ్చి, చెవులో యేదో చెప్పటంతో, యింకా రవ్వంత సందేహమేదైనా మిగిలివుంటే ఆ కాస్తా తీరిపోయింది. భోజనంవేళ అయేవరకూ ఆయన్ని యేమీ కదిలించకుండా అలాగే వూరుకోవటానికి నిశ్చయించుకున్నారు. అలాంటి సంఘటనేదీ జరగనట్టే నటించాలనుకున్నారు. ఆనక, కావలిస్తే, డాక్టర్ పరిస్థితిని అర్థంచేసుకుని వ్యవహరించటానికి నిర్ణయం చేసుకున్నారు.

లారీ యిచ్చిన సలహాను శిరసావహించి మిస్ ప్రాస్ తుచా తప్పకుండా నడుచుకుంది. ఇద్దరూ కలిసి ఆ పథకాన్ని దిగ్విజయంగా అమలు జరిపారు. లారీగారి స్నానాదికాలు ఒక పట్టాన తెమిలేవిగావు : ఆయన స్నానంచేసి బట్టలు మార్చుకోవటం పూర్తి అయేసరికి భోజనంవేళయింది. వచ్చి భోజనం బల్లదగ్గిర కూర్చున్నాడు. మిస్ ప్రాస్ వెళ్లి, మామూలుగా పిలిచినట్టే, డాక్టర్ గారిని భోజనానికి పిలిచింది.

డాక్టర్ గారిని కలవరపర్చకుండా వుండటానికి తగిన జాగ్రత్తలన్నీ తీసుకుంటూ లారీ చాలా తెలివితేటలుగా ప్రసంగం నడుపుకొస్తున్నాడు. ఆ అవధులలో ఆయన్ని యెంతవరకూ

అర్థం చేసుకోవటానికి వీలుందో అంతవరకే అర్థంచేసుకోవటానికి ప్రయత్నించుతున్నాడు. ఆశే అర్థంచేసుకోగా, డాక్టరు తన కుమార్తె పెళ్లి అయింది నిన్ననే ననే అభిప్రాయంలో వున్నట్టు, అతనికి తేలింది. ఎంచేతనంటే, ప్రసంగవశాత్తూ ఆనాటి తేదీ, నెలా గుర్తుకు తెచ్చేసరికి డాక్టర్ లెక్కజూసుకుని కొంచెం కలవరపడ్డట్టు గమనించాడు. అంచేత తిరిగి ఆ ప్రసంగం యెత్తకుండా లారి ధోరణి మార్చాడు. భోజనాలు పూర్తిఅయినాయి; లారీ, డాక్టరూ ఏకాంతంగా కూర్చుని కులాసాగా కబుర్లాడుతున్నారు. లారీ, లోలోపల యేదో ఆందోళన పడుతున్నవాడులా నెమ్మదిగా ఉపక్రమించాడు:

'డాక్టరుగారూ! మనకో స్నేహితుడున్నాడండీ! మనకు బాగా కావలసినవాడు లెండి! ఆయన కేసువిషయంలో కొంచెం మీ సలహా కావలసివచ్చింది. వైద్యవిషయాలలో మీరు అన్నీ తెలిసినవారుగనక మీకు ఎలా తోస్తుందో చెప్పలేనుగాని, నాకు మాత్రం చాలా విచిత్రమైన వ్యాధిలాకనుపించుతోంది!

డాక్టర్ మానెట్ తన అరచేతివ్రేళ్ళ వంక చూసుకుంటూ, లారీచెప్పిన కథంతా చాలా శ్రద్ధగా విన్నాడు.

'చూశారూ! డాక్టరుగారూ! పాపం, అతను మనకు చాలా ఆప్తుడు సుమండీ! మీరు కాస్త జాగ్రత్తగా ఆలోచించి నాకు తగిన సలహాచెప్పాలి—పాపం ఆయనకు ఒక కూతురు కూడా వుందండీ! పాపం, ఆ అమ్మాయి ఆయనంటే పంచప్రాణాలు విడుస్తుంది సుమండీ'—

'నాకు, చూడగా, యిదేదో, మనోవ్యథచేత కలిగిన మానసిక వ్యాధిగా కనుపించుతోంది; అన్నాడు డాక్టరు.

'అవునండీ! అబాపతే!—

'ఇంకా వ్యాధి స్వభావమంతా వివరంగా చెప్పండి ఆలోచిద్దాం'.

'మీరన్నట్టు ఆయన చాలారోజులు, రోజులేమిటి చాలా సంవత్సరాలపాటు యమయాతన లనుభవించాడు. ఆదశలో ఆయనకు సొంతం మతిపోయిందనే చెప్పవచ్చు. దైవకృపవల్ల ఆ అగచాట్లలోనుంచి బయటపడే సావకాశం కలిగింది తిరిగిప్రజల్లో పడ్డాడు; ఆయన తిరిగి ప్రజల్లోకి యెలా వచ్చాడో కూడా ఆయనకి తెలీదు—ఆమాట ఆయనే స్వయంగా చెప్పటం నేను విన్నాను. అంతాశుభ్రంగా బాగుపడి దారికి వచ్చిన వాడేనండీ: చక్కగా తన వృత్తి తను చేసుకుంటున్నాడు; మామూలు ప్రకారం చదువుకోవటం, నలుగురితో కులాసాగా మాట్లాడ్డం, పెద్దమనిషని అనిపించుకోవటం, యిదంతా వుంది. కాని, దురదృష్టవశాత్తూ, యీ మధ్యా—మళ్లా అంతా తిరగబెట్టిందండీ—ఉన్నట్టుండి అయోమయమై పోయాడు'

'అలా ఎన్నాళ్లపాటున్నాడు?'

'తొమ్మిది పగళ్లూ తొమ్మిదిరాత్రులూ'—

'తిరగబెట్టటమంటే యేవి జరిగిందంటారూ?—పూర్వం మతిబోయిన తరుణంలో చేస్తూవుండే పనులేవైనా చెయ్యటం మొదలు బెట్టాడా?'—

'ఆఁ!—అదేనండీ!'—

'అయితే ఒక మాట—మతిపోయిన మొదటి దశలో అలాంటి పనులు చేస్తూవుండటం మీరు ఎరుగుదురా?'—

'అవునండి స్వయంగా చూశాను'—

'మళ్లా మొన్న తిరగబెట్టిన దశలో—ఆ కూర్చోవటం, ఆ మనిషి వాలకం అదీ, పూర్వం మతిపోయిన దశలో యెలా వుండేవాడో అచ్చు అలానే వున్నాడా?'

'అచ్చు!'—

'ఇదుగో చూడండి! [illegible] ఆ అమ్మాయితో కొంపదీసి, యీ సంగతంతా [illegible]'—

'లేదులెండి; ఆ అమ్మాయికి తెలియకుండా రహస్యంగా వుంచాం. నాకూ, నాతో అంతర్యంవున్న మరొకరికీ తప్ప యీ సంగతి యెవ్వరికీ తెలీదు'—

డాక్టర్ ఆప్యాయంగా లారీ చెయ్యిబట్టుకున్నాడు: 'మంచి తెలివైన పనిచేశారు—ఎంతైనా మంచిపని చేశారు'—ఇద్దరూ క్షణం మౌనంగా యేమీ మాట్లాడకుండా కూర్చున్నారు. మళ్లీ లారీ మొదలుబెట్టాడు.

'ఇదుగో చూడండి డాక్టరుగారూ—చిన్నపటినుంచీ యేవో వ్యాపారసాపారాల్లో తిరిగినవాణ్ణిగాని ఇల్లాంటివన్నీ యెరిగినవాణ్ణిగాదు; అలాంటి చిక్కులేవైనా సంభవించితే యెలా సమర్థించాలో తెలియక తికమకపడుతున్నాను. అందుకే మీ సలహా తీసుకోవటం. అసలు అలా యెందుకు తిరగబెట్టిందంటారూ? అలా మళ్ళీ మళ్ళీ తిరగబెట్టే అవకాశం వుందంటారా? అలాంటప్పుడు యేమిఁ చేస్తే బాగుంటుంది? మనకు చాలా కావలసిన ఆప్తుడండీ, ఆయనకు యేవిధంగానైనా సాయపడగల్గునేమోనని ఆశపడుతున్నాను. యేదేనా మార్గముంటే ఆలోచించి చెప్పండి.'

రెండుమూడు నిమిషాలవరకూ మౌనంగా కూర్చుని డాక్టర్ చాలా తీవ్రంగా ఆలోచించాడు:

'లారీగారూ!—ఇటు చూశారూ! ఆ మయికం రాబోతోందని రోగికి ఆ సంగతి ముందుగా తెలుస్తుందనుకుంటాను. తెలియకుండా హఠాత్తుగా రావటం సంభవంకాదు.'

'అలా రాబోతోందని తెలిసినప్పుడు రోగికి భయమేస్తుందా?'—

'చాలా భయమేస్తుంది'—ఆ మాటలు ఉచ్చరించుతూ డాక్టర్ వొణికిపోయాడు.

'ఎంత భయంగా వుంటుందో, దాన్ని భరించటం యెంత కష్టమో మీరు ఊహించలేరు. దాన్ని తట్టుకోవటానికి యెంత ప్రయత్నించీకూడా ప్రయోజనముండదు—అది భయంకరమైన ఒక స్వప్నలాంటిది. దాన్నిగురించి పైకి చెప్పటానికి యెంత పెగుల్చుకున్నా నాలుక ఆడదు.'

'అలా యెట్టాగొట్టా పెగుల్చుకుని ఆ సంగతి యితరులతో చెప్పగలిగాడనుకోండి, ఆ స్థితిలోనుంచి బయటబడగలుగుతాడా?'—

'పడొచ్చు—కాని అలా చెప్పగలగటమనేదే అసంభవం అనుకుంటాను. అలాంటి రోగుల్లో నూటికి యే వొకరోతప్ప, అలా చెప్పలేరు.'

'అసలు అలా తిరగబెట్టటానికిగల కారణం యేమిటంటారు?'—

'మానవుని మనోభావనలో ఒక చిత్రం వుంది. ఒక భావానికీ ఒక భావానికీ లంకె వుంటుంది. ఒక సంగతి జ్ఞాపకం వచ్చిందంటే, దానికి సంబంధించిన అన్ని సంగతులు ఆచినా ఆగకుండా జ్ఞాపకానికివచ్చేస్తాయ్, ఇంజనువంట రైలుపెట్టెలు పరుగెత్తుకొచ్చినట్టు; పూర్వపు మనస్థితి యథాతథంగా మళ్లీ యేర్పడుతుంది. తీవ్రమైన బాధతోకూడిన ఆ అనుభూతులు తిరిగి మీద పడబోతున్నాయని రోగికి భయం పుట్టుకొస్తుంది. ఆ స్థితిలో చిక్కుబడకుండా వుండటానికి, మనస్సు అమిత కంగారుగా, నానాతంటాలూ పడుతుంది; ఆ భయంవల్ల మరింత బలహీనమై తేలికగా కుదబడిపోతుంది—మైకం క్రమ్మేస్తుంది.'

...మనస్సులా, యేవి జరుగుతుందో రోగికి ...ం వుంటుందా'

'రవ్వంతేనా వుండదు'—

'అయితే రోగి భవిష్యత్తు యేవిటంటారు'—

'మరేం ఫరవా లేదనుకుంటాను—దైవకృపవల్ల ఆ మైకం ఎక్కువ రోజులు ఉండిపోకుండా, కొద్ది అవధిలోనే బయటపడి పోగలిగాడు గనక పరవాలేదనుకుంటాను. అతను, ఎప్పుడు వచ్చి మీద పడిపోతుందోనని ఇన్నాళ్లూ ఎప్పటికప్పుడు యెంతో భయంతో వుండివుంటాడు. అది రావటమూ పోవటమూ రెండూ జరిగిపోయాయి గనుక ఆ భయం చాలావరకు తగ్గిపోయివుంటుంది. ఇకముందు అలాటిది మళ్ళీ తటస్థించకపోవచ్చు'—

'శుభం—ఆనందంగా వుంది' డాక్టర్ చిరునవ్వునవ్వాడు.

'మరో రెండు ముక్కలు అడగవలసివుంది—సెలవా ?'

'ఒకటి ఆయన తన వృత్తికి సంబంధించిన క్రొత్త క్రొత్త విషయాలు తెలుసుకోవటానికి, ఎప్పుడూ యేదో ఒకటి చదువుతూనే వుంటాడు; అలాంటి అమిత వ్యాసంగంవల్ల చెడు యేమైనా వుందంటారా ?'

'లేదు—కాకపోగా కొంత మంచిదనికూడా చెప్పొచ్చు; తమాషాయేవిటంటే ఆయనకు యెప్పుడూ యేదో ఒక పనిచేస్తూ వుండటం అలవాటై వుండవచ్చు; ఆరోగ్యకరమైన అలాంటి మంచి వ్యావృత్తి యేదైనా లేకపోతే, ఆయన అనారోగ్యకరమైన ఆలోచనలకు తిరిగే ప్రమాదంకూడా వుంది. ఈ సంగతి గ్రహించే బహుశా ఆయన అలా చేస్తూవుంటాడనుకుంటాను'

'తెలియక అడుగుతున్నాననుకోండి—మనస్సుకు అంతవత్తిడిగా పని కల్పించటం మంచిదేనా అని'—

'చూశారూ ! ఆయన్ను పెడమార్గానికి లాగటానికి లోపల బలమైన మానసిక స్థితి ఒకటి దాగివుంది. అటు మొగ్గకుండా చెయ్యటానికి యిటు అంతకంటే బలమైన వ్యావృత్తిని యేర్పాటు చెయ్యటం మంచిది.

'అయితే అలాంటిప్రమాదం తిరిగి సంభవించదని అనుకోవచ్చునా ?—

'అనుకోవచ్చుననే నాకు ఘట్టినమ్మకం—ఏదైనా భరించరాని క్రొత్తవేదన తటస్థించితే తప్ప అల్లాంటిది మళ్ళీరాకూడదు.'

'మరొకసంగతి అడుగుతాను చెప్పండి; ఉదాహరణకు, ఆరోగి మొదట్లో ఆ వ్యాధి తటస్థించినప్పుడు కమ్మరి పనిచేయటానికి అలవాటు పడ్డాడనుకోండి సుత్తీదాగరా ముందేసుకుకూర్చునే వాడు. తిరిగి మొన్న తిరగబెట్టినప్పుడు కూడా అలానే సుత్తీదాగరా ముందేసుకు కూర్చున్నాడు; వాటిని యింకా ఎప్పుడూ తన గదిలో అట్టిపెట్టుకు కూర్చోవటం మంచిదిగాదేమో—'

డాక్టర్ అరచేత్తో నుదురు తడుముకుంటున్నాడు; పాదాలు భూమిమీద నిలవత్రొక్కుకోవటానికి గట్టిగా అదిమి పట్టుకున్నాడు :

'ఆసామాన్లను యెప్పుడూ తనతోనే వుంచుకున్నాడుగదా!

'అదే వుంచుకుంటున్నాడు—ఇక వాటిని తీసి అవత... పారేస్తే పోదాఅని—'

'దాల్లోవున్న బాధమీకు అర్థంకాదు; పూర్వం ఆరో... అమితమైన మనోవేదన ననుభవించుతున్న రోజుల్లో, ఆ బాధన మరిచి పోవటానికి యీ వ్యావృత్తికి పూనుకున్నాడు. అందువల్ల అతనికి కొంత మనశ్శాంతి కలిగింది. అందుచేత వాటిని అవత... బెట్టటానికి అతని మనస్సు యెప్పుడూ యిష్టపడేదిగాదు. ఇప్పుడు కూడా అతని మనస్సు అలానే వుంటుంది. వాటిని గనక అవత... పారేస్తే లక్కపిడత పారేసుకున్న పసిబిడ్డలాగా ఆయన బా... పడవచ్చు'

'లాభంలేదు డాక్టరుగారూ వాటిని యెలాగైనా తీసి వెయ్య... దలిచాను—అవి అక్కడవున్నంతసేపూ ఆయన బుర్రలోనుంచి ఆ పాతజ్ఞాపకాలు పోయేట్టు లేవు—మీరు మరేం ప్రమాదం జర... దంటే ఆపని చేసేస్తాను'

డాక్టర్ మెదడులో జరుగుతున్న సంఘర్షణంతా లారీ అర్థమౌతూనే వుంది. ఆయన అభిప్రాయంకోసం యెదురుచూస్తున్నాడు.

'తీసివేస్తే తీసి వెయ్యవచ్చుగాని, ఆయన సమక్షంలో అలాంటిది జరగకూడదు. ఆయన యేవూళ్ళో లేనప్పుడో, అ... లేకుండా వాటిని తొలగించి వేయటంమంచిది.'

అంతటితో సంభాషణ ముగిసిపోయింది. ఆరోజంతా యి... రూకలిసి, పరిసరాల గ్రామీణప్రాంతాలలో షికారు తిరిగి రాత్రి యింటికి చేరుకున్నారు. ఆతరవాత రెండు మూడు రోజులూ కూడా డాక్టర్ యెంతో ఉల్లాసంగా వున్నాడు. పదునాల్గవ రోజు కూతుర్నీ అల్లుణ్ణి కలుసుకోవటానికి ఊరికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రే ఉలీ చేబాడితే పుచ్చుకుని, లారీ డాక్టర్ గా... గదిలో ప్రవేశించాడు. దీపం చేత్తోబుచ్చుకు మిస్. ప్రాస్... కూడా ఆయనకు సహాయపడటానికి వచ్చింది ఏదో ఒక పె... హత్యాకాండ జరపబోతున్న వాళ్ళలాగు యిద్దరూ లోపలికి ప్రవే... శించి తలుపులు మూసేశారు. లారీ, బాడిత తీసుకుని చెప్పులు కుట్టే సామానున్న ఆ పాత బెంచీని యింతింత ముక్కలుగా పేల్చి వేశాడు. ఆ పేళ్ళు పోగుజేసుకుపోయి వంటయింటో మండు... తున్న పొయ్యిలోపోసి శవదహనం పూర్తిచేసేశారు. తక్కి... పనిముట్లూ గట్రా పట్టుకెళ్ళి పెరటిదొడ్లో గొయ్యితీసి పూడ్చి పెట్టారు. అమాయిక హృదయాలకు, యేచిన్ని విధ్వంసక చర్యకై... పూనుకోవలసివచ్చినా క్రూరత్వంగానే కనిపిస్తుంది. ఆ చర్య జరుపుతున్నంతసేపూ వాళ్ళ యిద్దరి మనస్సులకూ యేదో నేరం చేస్తున్నట్టుగానే వుంది. ★

# మార్పు

(22-వ పేజీ తరువాయి)

రమ్మందమ్మా ముసలాయనకు బలువుగా ఉంది...'

'ఇదో వస్తున్నా...'

ముసలాడయినా కాని ఇంట్లో ఒక దేవతలా చూస్తున్నారాయన్ని కొడుకూ కోడలు. రంగమ్మ వెళ్ళి వాళ్ళని ఓదార్చి ఆ ప్రాణం కాస్త కుదుటపడేవరకూ తనే అన్నం పంపించింది.

*     *     *

'ఏం బాబాయ్ ఇంత పొద్దుపోయి వస్తున్నావు?' పరిస్థితులనుబట్టి పల్లెటూరన్నా, పల్లెటూరి మనుష్యులన్నా, కాస్త గౌరవం నేర్చిన సత్యం - సుబ్బయ్యను అడిగాడు ఆదుర్దాగా, రెండుగంటలకు వచ్చేసరికి. 'ఏమీ లేదమ్మా. కిష్టయ్య అని ఓ బీద వాడు చనిపోతే అనుమానంతో ఎవ్వరూ పలకలేదు. అందుకని నలుగుర్ని పోగు చేసుకుని ఆ కట్టెను కడతేర్చి వస్తున్నా' అన్నాడాయన.

చనిపోతే ఏడ్చేందుకు కూడా కూలీలను నియమించే మద్రాసు మహానగరం కళ్లకు కట్టింది సత్యానికి.

*     *     *

సెలవులు ఇక పదిరోజులే ఉన్నాయి. పల్లె జీవితానికీ పట్నవాసపు జీవితానికీగల వ్యత్యాసాలను ఆలోచించుకుంటూ మెల్లిగానడుస్తూ చెరువుగట్టునుంచి, వస్తున్న సత్యానికి వెనుక గంటలచప్పుడు వినపడింది. తిరిగి చూచేసరికి మేరువంత ఎద్దు తనను తొక్కివేసేందుకా అన్నట్లు ప్రచండంగా పరుగెత్తుకొస్తోంది! కాళ్ళ కింద మట్టి నిలవకుండా పరుగెత్తాడు అతను.

ఇది చూస్తూఉన్న రంగన్న పొలం వదిలి 'ఆగు రామయ్యా! బాబుగోరు భయపడుతుండారు' అంటూ వచ్చి ఆ ఎద్దు కొమ్ము పట్టుకున్నాడు. కాని ఆ వేగానికి ఎంత నిలదొక్కుకున్నా నిలవలేక పక్కగా పడిపోయాడు. సత్యం తిరిగివచ్చి చూసేసరికి ఆ ఎద్దు రంగన్నవంక జాలిగా చూస్తోంది.

'ఈ ఎద్దు జత లక్ష్మయ్య బాబూ. అది ముందెళ్ళి ఉంటుంది. ఇవి అప్పుడప్పుడూ పందెం వేసుకుని ఇలా పరుగెత్తుతాయి' అన్నాడు రంగన్న లేస్తూ.

సత్యం ఆలోచించిందల్లా 'తన ప్రాణాన్ని కూడా తెగించి రంగన్న ఆ ఎద్దును ఆపబోయాడు కదా' అని!

మోటారుకింద మనిషిపడితే, పోలీసు చూస్తే కేసు వస్తుందని ఓ ప్రముఖుడు అతన్ని అలాగే వదిలిపోయాడు మద్రాసులో. ఈ ఎద్దు గొప్పదో, ఆ డ్రైవరు గొప్పవాడో!

*     *     *

వచ్చేవాడు ఏదో మహాతప్పు చేస్తున్నట్లు అనిపించింది సత్యానికి. కాని ఈనాడు పోతూఉంటే కళ్లలో నీళ్ళు తిరిగాయి. పట్నవాసంకన్నా నరకం, పల్లెటూరికన్నా స్వర్గం లేదనిపించిందతనికి. అందువల్లనే ఈరోజు పోలేకపోలేక పోతున్నాడు.

'మీరిద్దరూ తప్పక రండమ్మా ఈమాటు' అంది సుబ్బలక్ష్మమ్మ బండెక్కుతూ.

'ఎందుకు బాబాయ్ మీరు ఆ దరిద్రపు పట్నవాసానికి? ఇక ప్రతీ సెలవులకూ మేమే వస్తాం!' అన్నాడు సత్యం.

'ఆ!' సుబ్బయ్యా రంగమ్మా నిజమో అబద్ధమో తెలీక విస్తుపోయారు.

'నిజంగా బాబాయ్' పల్లెటూరివారికే అర్థమయే నిర్మలమైన చూపుల్తో అన్నాడు సత్యం. ★



రాజహంస పిక్చర్సు వారి "సంగం" హిందీ చిత్రంలో బీనారాయ్.

# రేడియోలో సినిమా సంగీతం

"ఎన్నార్"

ఆలిండియా రేడియో కేంద్రాలనుంచి సినిమాసంగీతప్రసారాన్ని క్రమంగా తగ్గిస్తామని ప్రభుత్వం చేసిన నిర్ణయం రేడియో శ్రోతల లోకంలో పెద్ద అలజడి కలిగించింది. ప్రభుత్వం తమకు హఠాత్తుగా పెద్దమోసం తలపెట్టిందని రేడియో శ్రోతలూ, సినిమా పరిశ్రమనే అవమానించిందని సినిమా నిర్మాతలూ భావిస్తున్నారు.

ఇంతవరకూ రేడియో కేంద్రాలనుంచి ప్రసారం అవుతున్న రికార్డు సంగీతంలో నూటికి 60 వంతులదాకా సినిమా రికార్డుల సంగీతం ఉంటున్నది. దానిని నూటికి పది వంతులు ఉండేటు తగ్గించటానికి మాత్రమే ప్రభుత్వం నిర్ణయించింది కాని పూర్తిగా సినిమాసంగీత మంతటినీ నిషేధించటం లేదు. తగ్గించబడిన సంగీతం స్థానంలో వేరే తేలిక సంగీతం ప్రసారం చెయ్యటానికి కూడా ప్రభుత్వం నిర్ణయించింది. అందుచేత రేడియో శ్రోతలు రేడియో స్విచ్ చెయ్యగానే "బరువు సంగీతం" నెత్తిమీద విరుచుకు పడుతుందేమోనని అట్టే బెంగ పడనక్కర్లేదు. సినిమా సంగీతం సంపూర్ణంగా తిరోధానమైపోతుందని కూడా బెంగపడనక్కర్లేదు.

ప్రపంచం ద్వంద్వాల సంఘర్షణతో కూడినదని వేదాంతులు చెప్పేమాట నిజమని తోస్తుంది. రాజకీయరంగంలో రష్యా అమెరికాల సంఘర్షణ దగ్గిర్నుంచి సంగీత రంగంలో తేలిక సంగీతానికి (లైట్ మ్యూజిక్) శాస్త్రీయ సంగీతానికి (క్లాసికల్ మ్యూజిక్) సంఘర్షణదాకా అంతా ద్వంద్వాల సంఘర్షణే. సంగీతం విని ఆనందించే వారిలో రెండు రకాలవారు. ఒకరు తేలిక సంగీతం తప్ప వేరే సంగీతం లేదంటారు. సినిమా సంగీతం అంత తేలిక సంగీతం ఈ రోజుల్లో ఇంకొకటి లేదు గనక ఈ తరగతి వారంతా సినిమా సంగీతాన్నే ఆరాధిస్తారు. మరికొంతమంది తేలిక సంగీతం తేలికదైతే కావచ్చుగాని సంగీతంమాత్రం కాదనీ, అసలు శాస్త్రీయ సంగీతమే సంగీతమనీ వాదిస్తారు. శాస్త్రీయ సంగీతమంత బరువుది ఇంకొకటి లేదు గనక ఈ తరగతి వారంతా శాస్త్రీయసంగీతాన్ని ముసిగట్టుకుని విని, సినిమా సంగీతం వినిపిస్తే మైలపడినట్టు భావించి ఇంటికివెళ్లి సచేల స్నానం చేస్తారు.

## శాస్త్రీయ సంగీతం

నిజానికి ఈ ఉభయవర్గాలవారూ అతివాదులే. ఎందుకంటే సంగీతపు మంచిచెడ్డలు దాని బరువులో లేవు. తేలిక సంగీతంలోనూ మంచి ఉన్నది. శాస్త్రీయ సంగీతంలోనూ మంచి ఉన్నది. రెంటిలోనూ చెడ్డరకం ఉన్నది. మనకి కావలసింది శ్రావ్యమైన, సంగీతంమాత్రమే.

అసలు తేలిక సంగీతం, శాస్త్రీయ సంగీతం అంటూ ఉన్నాయా అంటే, ఉన్నాయి. శాస్త్రీయసంగీతం పాడేవాడు తనకున్న సంగీతశాస్త్రజ్ఞానాన్నంతనీ శ్రోతలకు రుద్దటానికి ప్రయత్నిస్తాడు. ఒక్కొక్క రాగం ఎత్తుకొని రెండుమూడు



అంజలీవారి "పరదేశి"లో ఒక సన్నివేశం.



పీపుల్స్ ఆర్ట్ వారి "పల్లెటూరు"లో ఒక సన్నివేశం. టి. జి. కమలాదేవి, వి. హనుమంతరావు.

గంటలసేపు తోమితోమి వదిలిపెడతాడు. 'పార్లల్ బార్' మీద వ్యాయామం చేసినంత హైరానపడతాడు. ఒక త్యాగరాయ కృతి ఎత్తుకున్నాడంటే, ఒక్కొక్క చరణాన్నే చెరుకుముక్కను మల్లే నమిలినమిలి పిప్పిచేసి, దాన్ని వదిలేసి మరో చరణానికి సాగుతాడు. శాస్త్రీయ సంగీతంలో ఇంత శారీరక శ్రమకూడా ఉంది కాబట్టే దీన్ని "బరువు సంగీత"మనికూడా అనవచ్చు. అందువల్లనే కొందరు "సున్నిత ప్రాణులు" ఈసంగీతమంటే జడుసుకుని దూరంగా పారిపోతారు.

## తేలికసంగీతం

ఇక తేలిక సంగీతం సంగతి. తేలిక సంగీతాన్ని సినిమాలే సృష్టించలేదు. ఈ రకం సంగీతం అన్ని దేశాల్లోనూ అనాది నుండీ ఉన్నదే. అంతే కాదు అసలుసంగీతమనేది తేలిక సంగీతంగానే ప్రారంభమైందని చెప్పవచ్చు. ఆదిమ సమాజాల్లో జనులు పనిపాటలు చేసుకుంటున్నప్పుడు శ్రమను మరిపించేందుకు, పని చెయ్యనప్పుడు కాలక్షేపంకోసం సంగీతం ఉపయోగపడేది. (ఇప్పటికీ పొలాల్లో పనిచేసే ప్రజలు పాటలు పాడుతూ పనిచేస్తారు. ఇలాంటివే దంపుళ్ళపాటలు, యాలపాటలు, బుర్రకథలు, హరికథలు. అసలు జానపదసంగీతమంతా తేలిక సంగీతమే.) ఇంతెందుకు — వేదమంత్ర పఠనంకూడా ఆదిమ ఆర్యసమాజంలో ఉపయోగించబడిన తేలిక సంగీతమే. సంగీత శాస్త్రం అభివృద్ధి అయి భిన్న భిన్న రాగాలు, తాళాలు రూపొందటంతో శాస్త్రీయ సంగీతమనేది ఏర్పడింది. శాస్త్రాభివృద్ధితో సంగీతం కళగా కూడా స్థాయిని పెంపొందించుకున్నది; సంగీత ప్రపంచం యొక్క పరిహద్దులు పెరిగాయి. ఆదిమ సంగీతం తేలిక సంగీతంగా ప్రారంభమైంది కనుకనే, అన్ని దేశాల్లోనూ అన్ని జాతుల్లోను జానపద సంగీతం ఇప్పటికీ దాదాపు ఒకే మాదిరిగా ఉంటుంది. స్పానిష్, రష్యన్, భారతీయ జానపద గీతాలు వింటుంటే కొన్ని కొన్ని పోలికలు కనిపించి ఆశ్చర్యం కలగజేస్తాయి. క్రమంగా నాగరికతతో పాటు సంగీతశాస్త్రం అభివృద్ధిపొందటం, ఏ దేశపు సంగీతం ఆ దేశంలో వేరు వేరుగా రూపొందటం జరిగింది. కనుక తేలిక సంగీతాన్ని చులకనగా చూసేవారిది పొరబాటే.

ఇంతకీ తేలిక సంగీతమంటే ఏమిటి? 'లైట్ మ్యూజిక్' అనే ఇంగ్లీషుమాటకు అనువాదం తేలిక సంగీతం. క్లిష్టత లేనిది, సులభమైన తాళం, సులభమైన రాగసంచారం కలది, సంగీతశాస్త్రం తెలియని అసంఖ్యాకులను ఆనందింపజేసేది, ఏదో ఒక నిర్దిష్ట భావాన్ని అభివ్యక్తం చేసేది తేలిక సంగీతం. శాస్త్రీయసంగీతం ఇంకా విశాలమైనది, లోతైనది. అనేక రసాలను, అనేక భావాలనువ్యక్తం చేస్తుంది. సంగీతశాస్త్రపరిజ్ఞానం ఎంత ఎక్కువ ఉంటే అంత ఎక్కువగా దీన్ని ఆనందించ

వచ్చు. అయితే మన గాయకులు శాస్త్రీయ సంగీతాన్ని కేవలం శాస్త్రంచేసి వదిలిపెట్టారు. వ్యాకరణశాస్త్రంలో నిష్ణాతుడైన పండితుడు ప్రత్యేకంగా తన శాస్త్ర పాటవం చూపించటానికే రచన చేస్తాడనుకోండి. అది వ్యాకరణం అవుతుందేమో కాని సాహిత్యం మాత్రం కాదు. ఎందువల్ల? రచన అనేదాని ప్రయోజనం ఒకరి అభిప్రాయాన్ని మరొకరికి వీలైనంత చక్కగా, రసాత్మకంగా చెప్పటమే కదా? ఈ ప్రయోజనాన్ని విస్మరించినప్పుడు ఉత్పన్నమయ్యేది సాహిత్యం కాదు. అలాగే సంగీతం యొక్క ప్రయోజనం రసస్పృష్టి. సరిగమల కుస్తీ పట్లమధ్య రసస్పృష్టికవకాశమే ఉండదు. కొందరు శాస్త్రీయ గాయకుల కచ్చేరీలకు వెళ్ళినప్పుడు మద్దెల, ఫిడేలు వాయిద్యగాళ్లను, గాయకుణ్ణి చూస్తుంటే యుద్ధరంగం జ్ఞాపకం వచ్చే అవకాశాలే ఎక్కువ ఉంటాయి. కాని ఏ ద్వారం వెంకటస్వామినాయుడుగారి ఫిడేలు గానమో విన్నప్పుడు శాస్త్రీయ సంగీతంపట్ల గొప్ప పూజ్యభావం కలుగుతుంది.

## సినిమా పాటలు

ప్రస్తుతకాలంలో, కనీసం మనదేశంలో, తేలికసంగీతాన్ని సృష్టిస్తున్నది సినిమాలేనని ఒప్పుకోకతప్పదు. ఇందుకు అనేక కారణాలున్నాయి. ఏడాదికి అధమపక్షం 200 సినిమాచిత్రాలు తయారవుతున్నాయి. ఒక్కొక్కచిత్రంలో సగటున 12 పాటలు ఉంటే, ఏడాదికి 2400 పాటలు తయారవుతున్నాయన్నమాట. ఇన్ని పాటలూ దేశమంతటా అతి త్వరలో పాకిపోతున్నాయి. సినిమా చిత్రాలకు, గ్రామఫోను రికార్డులకు, రేడియోలకుగల బహుళవ్యాప్తే ఇందుకు ముఖ్యకారణం. ఎక్కడ చూసినా, ఎవరినోట విన్నా సినిమా పాటలే. వీటి ప్రభావం ఎంతవరకూ వచ్చిందంటే ఇళ్ళల్లో స్త్రీల మంగళహారతుల పాటలుకూడా సినిమాపాటల వరసల్ని అనుకరించి పాడబడుతున్నాయి. హరికథలు చెప్పే హరిదాసులుకూడా హిందీ పాటల వరసల్లో పాటలుకట్టి పాడటం జరుగుతోంది.

అయితే ఏటా తయారయ్యే ఈ 2400 పాటలూ ఉత్తమ స్థాయిలో ఉంటున్నాయా అంటే, ఉండటం లేదు; ఉండటం అసంభవం కూడాను. ఇది యంత్రయుగం. మనకు కావలసిన వస్తువులను భారీఎత్తున భారీ యంత్రాల సహాయంతో ఉత్పత్తి చేసుకుంటున్నాము గనక దీన్ని యంత్రయుగం అంటున్నాం. యంత్రాలద్వారా ఉత్పత్తి చెయ్యటం కళాసృష్టి కాదు. కళాసృష్టిలో సృజనానందం ఉంటుంది. యంత్రసృష్టిలో భారీ అవసరం తీర్చుకోవటం మాత్రమే ఉంటుంది. కాని ఈరోజుల్లో కళాసృష్టి కూడా యాంత్రికంగా తయారయింది. ఏడాదికి 2400 కొత్తపాటలు తయారు కావలసి రావటమే దీనికి కారణం. దీనికి ఎవరూ చేసేదేమీ లేదు.

కాగా ఈ 2400 పాటల్లో ఏ డజను



అవర్ ఇండియావారి "నాయిల్లు"లో లింగమూర్తి, విద్యావతి మొదలైనవారు.

పాటల్లో తప్ప, మిగతా వాటిల్లో కొన్ని తాత్కాలిక సంతృప్తి కలిగించేవి, కొన్ని ఆ సంతృప్తిని కూడా కలిగించనివి ఉంటున్నాయి. వీటినన్నిటినీ సంగీతంకింద జమ కట్టలేము. ఈ పాటల్లో ఎక్కువ భాగం సంగీతరంగంలో వచ్చే ఫేషన్లనుమాత్రమే ప్రతిబింబిస్తాయి. కొన్నాళ్ళక్రిందట డోలక్ సంగీతం, పంజాబీ సంగీతం ఫేషను. ఇప్పుడు "రుంబా" సంగీత ధోరణి ఫేషన్. కొన్నాళ్ళకి ఇదీ పోతుంది. ఫేషన్‌కీ సంస్కృతికీ తేడా ఇదే. ఫేషన్లు వస్తాయి, పోతాయి. సంస్కృతి నిలిచిపోతుంది; అభివృద్ధి అవుతుంది. ఒకప్పుడు "సునో సునో" పాట దేశాన్ని ఆక్రమించింది. తరవాత ఆ పాట వింటేనే డోకు పుట్టుకొచ్చింది. కాని త్యాగరాయకృతులు, క్షేత్రయ్య పదాలు, ఆఖరికి "చల్ మోహన రంగా" పాట సైతం మనజాతి సంస్కృతికి ప్రతినిధులుగా శాశ్వతంగా ఉండిపోతాయి. అదీ అసలు రహస్యం. జాతీయ సంస్కృతిని, సంప్రదాయాన్ని పునాదిగా చేసుకుని నిర్మింపబడిన కళ ఎప్పటికీ చులకన కాదు; అది ఎల్లప్పుడూ గౌరవింపదగినదే.

ఇప్పటి సినిమా పాటలు సంగీతపు విలువలను చాలా కిందికి ఈడ్చివేశాయి. ప్రజలు 'సినిమా పాటలే అసలైన సంగీతం' అనుకునేట్టుగా చేశాయి.

ఆ మాటంటే సినిమాలవారు కనుబొమలు ముడిచి "ప్రజలు ఏ సంగీతం కావాలంటే ఆ సంగీతం ఇవ్వటం మా విధి. "రుంబా" సంగీతపు అనుకరణపై ప్రజలకు మోజుంటే ఆ సంగీతమే ఇస్తాం. చెత్త సంగీతాన్నే ప్రజలు కోరితే చెత్తసంగీతమే ఇస్తాం," అంటారు. కాని ఈ వాదం కేవలం నిస్సారమూ అభివృద్ధి నిరోధకమూ అయినది. ప్రజల సంగీతాభిరుచిని హీనస్థాయికి దింపిందీ సినిమా పారిశ్రామికులే. దాన్ని ఆసరాగా చేసుకుని లబ్ధిపొందేదీ సినిమా పారిశ్రామికులే. ఎందుకంటే కొన్నేళ్ళపాటు వరసగా చెత్త సంగీతం తప్ప ఇంకేమీ విననందున "సంగీతం అంటే ఇంతేనేమో," అని ప్రజలకు నమ్మకం ఏర్పడుతుంది. ఇటీవల ఈ వ్యాస రచయితకు ఇలాంటిదే ఒక ధర్మసందేహం కలిగింది. వరసగా హిందీ, తెలుగు, తమిళ చిత్రాలు చూశాక "సినిమా అంటే ఇంతేనేమో. వాస్తవ జీవితాన్ని, మానవుడి అంతరంగాన్ని, లేక ఒక శక్తివంతమైన సన్నివేశాన్ని, చిత్రించటానికి సినిమా సరియైన సాధనం (మీడియం) కాదేమో" అనే సందేహం ఈ రచయితకు కలిగింది. ఆ సందేహం "భూలీసై" అనే బెంగాలీ చిత్రం చూసేవరకూ తీరలేదు.

అయితే సినిమా సంగీతమంతా చెత్త సంగీతమని ఈ రచయిత అభిప్రాయం కాదు. సినిమా సంగీతాన్ని ఉన్నత శిఖరాలకు తీసుకొనిపోయినవారు మనదేశంలో పలువురున్నారు. బెంగాల్‌లో ఆర్. సి. బోరల్, హేమంతకుమార్, పంకజ్ మల్లిక్, ఎస్. డి. బర్మన్, బొంబాయిలో అనిల్ బిశ్వాస్, కృష్ణరావు, వసంత్ దేశాయి, నౌషద్, మనవైపున నాగయ్య, రాజేశ్వరరావు వీరంతా ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడైనా చాలమంచి సంగీతం ఇచ్చారు. గాయకులలో సైగల్, జూతికా రాయ్ మొదలైనవారికి ఎప్పుడూ గౌరవ స్థానం ఉండనే ఉంటుంది. ఉదయశంకర్ తీసిన "కల్పన" చిత్రంలో విష్ణుదాస్ షిరాలీ గొప్ప సంగీతం సృష్టించాడు. అలాగే "మల్లీశ్వరి" చిత్రంలో రాజేశ్వరరావు కొన్ని చాలా చక్కని పాటలను సృష్టించాడు. అవన్నీ బంగారపు గనిలాంటి మన సంగీత సంప్రదాయంలోంచి తవ్వుకొని వచ్చినవే. వాటినిసైతం మనం "బరువు సంగీతం"కింద కట్టేశాం.

## అలజడిదేనికి ?

ఇంతకీ రేడియోలలో సినిమా పాటలు తగ్గించటంపై సినిమాలవారు సహజంగా అసమ్మతి వెల్లడించినా, శ్రోతలు అలజడి పడవలసినంత కారణం లేదు. గ్రామఫోను రికార్డులలో ఉత్తమమైనవాటిని, అంటే సైగల్, పంకజ్, జూతికారాయ్, బాలగంధర్వ మొదలైనవారి రికార్డులను రేడియోలు ఎలాగూ ప్రసారం చేస్తాయి. సినిమా రికార్డుల సంఖ్యను తగ్గించటంవల్ల కొన్ని లాభాలు కూడా ఉన్నాయి. ఒక లాభమేమిటంటే సినిమా పాటలపై ప్రజలకు అసహ్యం కలక్కుండా చెయ్యవచ్చు. "డడడా" పాటపై ఇంత త్వరలో అసహ్యం కలిగించింది రేడియోలేనేమో. ఈపాటను రోజుకి రెండు మూడుసార్లు కూడా ప్రసారం చేసినట్టు గుర్తు; అపాటంటే శ్రోతలకు రోత కలిగేదాకా ప్రసారం చేశారు.

మరొక లాభమేమిటంటే రేడియోలలో అనేకమంది బయటివారికి ప్రవేశం లభిస్తుంది. సినిమాలకు రికార్డులిచ్చే తేలిక గాయకులకు నిర్మాతలనుండి ఎలాగూ బోలెడంత ప్రోత్సాహం లభిస్తూనేఉంది. ఆ గాయకులే రేడియోలను కూడా గుత్తకు పుచ్చుకోవాలని ఎక్కడా లేదు. తేలిక సంగీతం సినిమాలలోనే కాక బయట కూడా సృష్టిఅవుతుంది. దేశంలో అనేకమంది చక్కటి సంగీతం పాడగలవారున్నారు. వీరందరికీ సినిమాలలో ఛాన్సు దొరక్కపోవచ్చు. అటువంటివారికి ఛాన్సు యిచ్చి ప్రోత్సహించటం రేడియోవారివిధి. ఈ విధిని నెరవేర్చిన నాడు రేడియోవారికి శ్రోతలు, పాటగాళ్ళూ కూడా కృతజ్ఞులై ఉంటారు. కాని రేడియోవారు శాస్త్రీయసంగీతాన్ని ఇప్పటికంటే ఎక్కువ చెయ్యదలచినట్లుంది. బలవంతాన శాస్త్రీయ సంగీతం వినిపించి ప్రజల సంగీతాభిరుచిని అభివృద్ధి చేద్దామనుకుంటే ఫలితం ఉండదు. శాస్త్రీయ సంగీతాన్ని ఆదరించే వారికంటే తేలిక సంగీతాన్ని కోరేవారే ఎప్పుడూ ఎక్కువ. అందుచేత శాస్త్రీయసంగీతాన్ని ఇప్పుడున్నంతవరకే ఉంచి తగ్గించబడిన సినిమాసంగీతంయొక్క స్థానమంతా వేరే తేలికసంగీతానికి ఇవ్వటం న్యాయం. సినిమాలు ఒకరకమైన తేలిక సంగీతానికి రూపురేఖలు తీర్చిదిద్దాయి. రేడియోవారు మరొకరకమైన తేలిక సంగీతాన్ని పరిణమింపచెయ్యగలగాలి.



ఈస్టిండియావారి "సంక్రాంతి"లో శ్రీ రంజని.

# రష్యాలో భారతీయ సినిమా ★ ★ ★ ★ ★ ★ ప్రతినిధులు

కిందటి సంవత్సరం సోవియెట్ ప్రభుత్వంవారు తమదేశం చూడవలసిందిగా కొందరు భారతీయ సినిమా ప్రతినిధులను ఆహ్వానించారు. గత అక్టోబరులో మన ప్రతినిధులు రష్యా వెళ్లారు. వీరిలో భట్టాచార్య, దుర్గాఖోటే, కేంద్ర ప్రభుత్వ ప్రతినిధి ముఖర్జీ, కె. సుబ్రహ్మణ్యం, కృష్ణన్, మధురం మొదలైనవారున్నారు. వీరు సోవియెట్ యూనియన్‌లో ఈ మూలనుండి ఆమూలవరకూ పర్యటించారు. వారిపర్యటనను మాస్కో డాక్యుమెంటరీ ఫిల్మ్ సంస్థవారు సెల్యులాయిడ్ మీద కెక్కించారు. ఈ డాక్యుమెంటరీ చిత్రం గత గురువారంనాడు దక్షిణభారత ఫిల్మ్ వాణిజ్యమండలివారు వెలింగ్టన్ టాకీస్‌లో పత్రికలవారికి చూపించారు. ఇప్పుడిది క్రౌన్‌టాకీస్‌లో చూపబడుతున్నది.

ఈ డాక్యుమెంటరీ చిత్రం 6 వేల అడుగుల పొడుగుండి గంటసేపు నడుస్తుంది. ఆ గంటలో సోవియెట్ యూనియన్‌లో భారతీయ ప్రతినిధులు చూసిన చరిత్రాత్మక ప్రదేశాలు, ఆధునిక భవనాలు, ఇతర సుందర దృశ్యాలు మనంకూడా చూసి ఆనందించవచ్చును. ప్రతినిధులకు రష్యనులిచ్చిన స్వాగతం, వారి గౌరవార్థం రష్యన్ థియేటర్లలో ప్రదర్శించబడిన బాలెట్ నృత్యాలు, సంగీత కచ్చేరీలు చూడవచ్చు. ముఖ్యంగా బాలెట్ నృత్యం చూడదగినది. డాక్యుమెంటరీ చిత్రమైనా ప్రేక్షకులకు విసుగు జనించకుండా ఉండేట్టు తీయబడింది. ★

---

రోజున తేలిక సంగీతాన్ని సృష్టించటంలో సినిమాలతో పోటీచెయ్యగల సంస్థ ఏదైనా ఉంటే అది రేడియోసంస్థే. సినిమాలకు కేవలం లోకలాగా పనిచెయ్యవలసిన అవసరం రేడియోసంస్థకు లేదు. ఈ రెంటికి ఈవిధంగా సుహృద్భావపూరితమైన పోటీ ఉండటం సంగీతకళకే శ్రేయస్కరం. ★



నవయుగవారి "జ్యోతి"లో జ్యోతి తండ్రిగా లక్ష్మి పెరుమాళ్లు.

## సినిమా వార్తలు

ప్రపంచ చలన చిత్రోత్సవాల సందర్భంలో మనదేశీయుల ఏకగ్రీవ ప్రశంసలను పొందిన ఇటాలియన్ చిత్రం "బైసికిల్ థీఫ్" జపానీస్ చిత్రం "యూకివారీసూ" ఈ రెంటినీ ఆంధ్రదేశంలో పూర్ణాపిక్చర్సువారు విడుదల చేయనున్నారట. తెలుగు సబ్ టైటిల్సుతోసహా వీటిని విడుదల చేస్తారు గనుక ఆ భాషలు తెలియకపోయినా ప్రతి ప్రేక్షకుడూ ఈ చిత్రాలు చూసి ఆనందించగలడు.

* * *

బంకించంద్ర ఛటర్జీ నవల "కపాలకుండల"ను ఇదివరలో న్యూథియేటర్సు వారు హిందీ, బెంగాలీలలో తీసి గొప్ప విజయం పొందారు. ఇప్పుడు [illegible] అర్ధేందు ముఖర్జీ తిరిగి బెంగాలీలో తీశాడట. హిందీలో కూడా ఈ చిత్రం తయారవుతున్నదట.

* * *

న్యూథియేటర్సువారు హిందీ, బెంగాలీలలో రెండు భిన్నచిత్రాలు తీస్తున్నారు. బెంగాలీలలో తీయనున్న "నవీన్‌జాత్ర"ను సుబోధ్ మిత్ర డైరెక్టు చేస్తాడట. మనోజ్ బోస్ రాసిన నవల ఈ చిత్రానికి కథగా స్వీకరింపబడిందట. హిందీలో తీయనున్న "మంత్రశక్తి" చిత్రాన్ని హేమచందర్ డైరెక్టు చేస్తాడట.

* * *

మద్రాసులోని "ఫ్రెండ్స్ యూనియన్" అనే బెంగాలీ సంఘం నగరంలోని తమ రాష్ట్రీయులకోసమని అడపాతడపా బెంగాలీ చిత్రాలు తెప్పించి ఆదివారాలనాడు చూపిస్తున్నారు. ఈ మధ్య "భూలీనై" అనే చిత్రం తెప్పించారు. ఇది పాత చిత్రమైనా "అబ్బాయి—అమ్మాయి" చిత్రాలతో విసుగెత్తినవారికి ఉత్సాహం కలిగించేదిగా ఉన్నది. 1905లో బెంగాల్ విభజనను ప్రతిఘటిస్తూ బెంగాల్‌లో వందేమాతరం ఉద్యమం ప్రజ్వలించింది. ఆ ఉద్యమ వాతావరణం తీసుకుని మనోజ్

[illegible] నవలయితే విప్లవాత్మకమైన నవల వ్రాశాడు. ఆ నవలయే ఈ చిత్రంయొక్క ఇతివృత్తం. హేమేన్‌గుప్త దర్శకత్వం అతి విశిష్టంగా ఉంది. సుమారు మూడుగంటల చిత్రమైనా అసలు కథకు సంబంధించని ఒక్క సన్నివేశం కూడా లేకుండా, అంతసేపూ ప్రేక్షకులు కథలో నిమగ్నులై పోయేటట్లుగా తీశాడు. చిత్రమంతటా 1905 నాటి రాజకీయ వాతావరణం గాఢమైన దేశభక్తి తప్ప మరేమీ లేదు. ఉద్యమంలో పనిచేసే ఒక వ్యక్తి, ఉద్యమానికి ద్రోహంచేసిన మరొక వ్యక్తిని హత్య చేస్తాడు. హంతకునికి ఉరిశిక్ష వేస్తారు. అతడు ధైర్యంతో, చిరునవ్వుతో. భవిష్యత్తుపై ఆశాభావంతో ఉరికంబం ఎక్కటం ఎంత శక్తివంతంగా చూపించబడిందంటే హాల్లో కూర్చున్న ప్రతివాడూ జేబురుమాలు తీసి కళ్ళు తుడుచుకున్నాడు. ఇంత హృదయంగమమైన చిత్రాలు ఈ రోజుల్లో ఎంత అరుదైనాయి! మరొక విశేష మేమంటే ఇంత దీర్ఘచిత్రంలో నాలుగు పాటలకంటె ఎక్కువ లేవు. అవైనా కథలో భాగాలుగా కనిపిస్తాయి గాని బలవంతాన లాక్కొచ్చినట్టు లేవు. సంగీతదర్శకుడు ప్రసిద్ధ గాయకుడైన హేమంతకుమార్.

మన డిస్ట్రిబ్యూటర్లు బెంగాలీ చిత్రాలను నిర్లక్ష్యం చేస్తున్నారుగాని, సబ్ టైటిల్స్‌తోగాని లేక మరోవిధంగానో వాటిని ఆంధ్రదేశంలోకి దిగుమతి చేసుకుంటే వాటికి కావలసినంత మార్కెట్ లభించగలదని తోస్తుంది.

## నగరంలో కొత్తసినిమాలు

గతవారం నగరంలో కొత్తగా తెలుగు సినిమా "దీక్ష" విడుదల అయింది. జి. వరలక్ష్మి, రామగోపాల్, వి. శివరాం మున్నగువారు నటించిన ఈ చిత్రం సెలెక్టులో ప్రదర్శింపబడుతోంది.

కాసినో; సెలెక్టులలో చాల నెలలు జయప్రదంగా నడిచిన "మల్లీశ్వరి" లక్ష్మీ టాకీస్ (అమింజికరై)లో ఆడుతోంది. ఏ అరవ చిత్రమూ మద్రాసులో ఇంత విజయంపొందలేదే అని తమిళులంతా ఆశ్చర్యపడుతున్నారు.

నసీం, రహమాన్, ఆగా మున్నగువారు నటించిన తాజ్ మహల్స్ "అజీబ్ లడ్కీ" హిందీచిత్రం అశోక్, రాజకుమారీ థియేటర్లలో నడుస్తున్నది.

విజయావారి 'పెళ్ళిచేసిచూడు' తమిళ తర్జుమా అయిన "కల్యాణం పణ్ణిప్పార్" కాసినోలో విడుదలయింది. జి. వరలక్ష్మి, ఎన్. టి. రామారావు ముఖ్య నటీనటులు.

★

పంజాబ్ ఫిల్మ్ కార్పొరేషన్ వారి "లోరి" హిందీ చిత్రంలో సురేష్.



పెళ్ళాంతో మాట్లాడటానికి కూడా వీల్లేకుండా తల్లి కట్టడిచేసింది. అయినా అర్ధరాత్రివేళ దొంగతనంగా లేచి పెళ్ళాన్ని వెన్నెల్లోకి లాక్కొచ్చాడు.

**రాజా ప్రొడక్షన్స్ వారి "పుట్టిల్లు"లో రాజారావు, జమున.**

# ప్రశ్నలు సమాధానాలు

బి. టి. వి. కుమార్—వైజాగ్.

ప్రస్తుత కేంద్ర మంత్రివర్గంలో ఆంధ్రులకు ఒక మంత్రి పదవి కూడా లేకుండుటకు కారణం?

—కార్మిక శాఖామంత్రి గిరిగారిని ఎవరికింద జమకట్టారు?

*　　*　　*

ఎస్. శ్రీదేవి-కడప.

"లైలామజ్ను", "ప్రేమ" చిత్రములు ఇంచుమించుగ ఒకటేయైనప్పటికిని, ఒకే నటులు అయినప్పటికిని లైలామజ్ను ప్రసిద్ధికెక్కి, "ప్రేమ" ప్రసిద్ధికెక్కని కారణమేమి?

—లైలామజ్ను కథ వ్రాసినది ప్రఖ్యాత పర్షియన్‌కవి నిజామీ. "ప్రేమ" కథ వ్రాసినది ప్రఖ్యాత నటీమణి భానుమతి.

*　　*　　*

కె. రామారావు—జగ్గయ్యపేట.

ఆంధ్రరాష్ట్రం ఇవ్వకపోవటంలో నెహ్రూగారి యొక్క ఉద్దేశ్యం ఏమిటండీ?

—ఆంధ్రరాష్ట్రం ఆయన జేబులో లేకపోడం.

*　　*　　*

వి. వసుశోభరణం—తెనాలి.

ఈ రోజులలో సినిమాలను గురించి నేర్చుకొనవలసిన నీతియేమి?

—వాటినుండి నేర్చుకోదగిన నీతి ఏమీ లేదనే నీతి.

*　　*　　*

లక్కరాజు సరోజినీదేవి—తెనాలి.

మా లెక్చరెస్ మమ్ములను తేలు ప్రసవించినప్పుడు చనిపోతుందా? అని అడిగితే, చనిపోతుందని చెప్పినాము. కాని యామె చనిపోదని చెప్పినది. నిజమునకు చనిపోతుందా? లేదా?

—ప్రసవమే కారణముగా తేలు చచ్చిపోదు. తల్లి తేలు తన వీపు మీద పిల్లల్ని పెట్టుకుని తిరుగుతుంది కూడాను. తేళ్ళు ఒకదాని నొకటి తినేయడము కద్దు. అలాగ సగము సగము మిగిలిన తేళ్ళే మీకున్న అభిప్రాయము కలగడానికి కారణాలై యుండవచ్చు. ఏప్రాణి అయినా ప్రసవించి చచ్చిపోడము సృష్టిసూత్రాలకి విరుద్ధము కాదూ?

*　　*　　*

వి. అప్పారావు—పాగోడు.

విద్యార్థులు సినీమారంగములో ప్రవేశించుటలో మీ అభిప్రాయ మేమిటి?

—విద్యకు తిలోదకాలివ్వ సిద్ధపడితే చేరవచ్చు.

స్త్రీకి అబలఅన్న పేరు ఈ రోజులలో ఎంతవరకు వర్తిస్తుంది?

—పురుషులు ఎవరి అనుభవాన్ని బట్టి వాళ్లు తేల్చుకోవచ్చు.

*　　*　　*

డి. రాధాకృష్ణయ్యనాయుడు-నెల్లూరు.

మన చిత్రాలలో సెన్సారు, ముద్దులు నిషేధించినా ఇంగ్లీషు చిత్రాలను మన రాష్ట్రంలో ఎందుకు నిషేధించరు?

—పాశ్చాత్య సమాజంలో స్త్రీ పురుషులు బహిరంగంగా ముద్దుపెట్టుకోవటం తప్పుకాదు. ఈ ఆచారం మన సమాజంలోకి కూడా వస్తే మన చిత్రాల్లో కూడా ముద్దులను అనుమతిస్తారు. ముద్దులున్నాయని నిషేధించ మొదలెడితే ఒక్క పాశ్చాత్యచిత్రానికీ మనదేశంలో ప్రవేశించే అర్హత ఉండదు.

*　　*　　*

వై. సత్యనారాయణ—విశాఖపట్నం.

మీరు బొమ్మలతో అచ్చు వేయించే పంచతంత్రములో "మిత్రభేదము" ఈమధ్య నుండి వేశారు కానీ 1951-52 లో వేసిన 1952 మార్చికి వెళ్లినవారికి ఎంతో మార్గదర్శకులు అనిపించుకొనేవారు. మీరు అట్లు వేయకుండా పరీక్షలు అయి స్కూళ్లు పెట్టినతర్వాత ప్రారంభించుటకు కారణమేమండీ?

—పంచతంత్రంతో ప్రయోజనం పరీక్షలకువెళ్లే కుర్రాళ్ళకంటే ప్రపంచంలో పైకి రావాలనుకొనే పెద్దలకే ఎక్కువగా వుంటుంది.

*　　*　　*

పి. బాబు—విజయవాడ.

లారల్,హార్డీ, చార్లీచాప్లిన్లలో యెవరు బాగా ప్రజలను హాస్యరసముతో ఆనందింపజేయగలరు?

—లారెల్, హార్డీ చిత్రాలు కేవలం హాస్య సన్నివేశాలుగల చిత్రాలు. చార్లీ చాప్లిన్ హాస్యంలో (శ్రీ. శ్రీ కన్యాశుల్కాన్ని గూర్చి అన్నట్టు) బీభత్సరసం ఉంటుంది.

*　　*　　*

బి. నారాయణరావు—గుంటూరు

రామాయణ, మహాభారతములలో విజ్ఞాన విషయములు నిగూఢంగా వున్నాయని అంటారు. నిజమేనా?

—నిజమే. కాని వచ్చిన కర్మమేమిటంటే అవి అందరికీ నిగూఢంగానే ఉండిపోతున్నాయి. ఎన్నడూ బయటికిరాలేవు.

రాగినీళ్ల కొగుకు తారులాంటి పదార్థము పేరుకొనియుండును ఆ పదార్థము ఏవిధముగా ఏర్పడును?

—క్రరలలో నూనె వుంగునని మీకు తెలుసు ననుకుంటాను. ఈ నూనె కాలినప్పుడు బరువైన హైడ్రో కార్బనులూ తేలికైన హైడ్రోకార్బనులూ ఏర్పడతాయి. తేలికైనవి మండిపోతాయి. బరువైనవి కాలిపోలేక కొగుని పట్టుకుంటాయి. ఇవే మీరు తారు అన్న పదార్థము. వంటగిన్నెల 'మసి' లో కూడా కొంత ఈ తారు ఉంటుంది. అందుకే వాటిని తోమడము శ్రమ.

*　　*　　*

డి. నరసింహారావు—తెనాలి.

మా మిత్రుడు "పెళ్లిచేసిచూడు" సినిమా చూసినప్పటినుండి "ఎవడో స్తాడో చూస్తాగా" అని అందరిమీద కారణము లేకుండా తిరగబడుతూ యున్నాడు. అతనిని అరికట్టే పద్ధతేదైనా తెలియచేస్తారా?

—"పెళ్లి" చేసిచూడండి.

*　　*　　*

వై సత్యనారాయణ—బళ్ళారి.

నెహ్రూ విరోధి ఎవరండీ?

—కులమత జాతిభేదతత్వాలు.

*　　*　　*

వీరప నేనిజస్వంతరావు—కవుతరం.

"కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో" సినిమా తెలుగులో తీశారని 30-7-52 న వ్రాశారు. అయితే అది ఎన్ని సంవత్సరాల అయింది వచ్చి? దానిలో నటించినటు లెవ్వరు? దానికి యింకేమన్నా పేరు పెట్టారా?

—"కాలచక్రం" అనే పేరుతో నవీన భారత్ ఫిలిమ్స్‌వారు 1940 లో కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో కథను ఎడాప్ట్‌చేసి తీశారు. అందులో కీ. శే. ముంజులూరి కృష్ణరావు, శ్రీ బందా కనకలింగేశ్వరరావు, శ్రీమతి లక్ష్మీరాజ్యం కీ. శే నెలూరి నగరాజరావు మున్నగువారు నటించారు. డైరెక్టర్లు ఆమంచర్ల గోపాలరావు, కలపటపు రామగోపాల్.

* * *

చామర్తి వేణుగోపాలరావు—ఘటో టాండు (బీహారు)

రష్యాలోగల కమ్యూనిస్టులకు భారత దేశపు కమ్యూనిస్టులకు గల ముఖ్య భేద మేమిటండీ?

—వారు రష్యన్లు, వీరు భారతీయులు. అంతే తేడా.

* * *

యం. అభిమన్యు—కర్నూలు.

మీరు వారపత్రికయందు ప్రచురించు చున్న విజ్ఞాన వీధులనే శీర్షికలోని ప్రశ్నలను మీరేవేస్తూ జవాబు లిస్తున్నారా, లేక ఎవరయినా పంపినవాటికి జవాబు లిస్తున్నారా? ఆ శీర్షికకు సంబంధించిన ప్రశ్నలను పంపుతే ప్రచురింపకోని జవాబు లిస్తారా?

—'డాక్టర్' గారే విజ్ఞాన విషయిక మైన విచిత్రమైన అంశాలు ఎంచి వ్రాస్తున్నారు. అయితే పాఠకుల ప్రశ్నలకు కూడా వారు సమాధానా లివ్వగలరు. విజ్ఞాన వీధులు' శీర్షిక క్రింద గమనిక గమనించండి.

* * *

జె వి. కృష్ణకుమార్—బందరు.

మెహబూబ్ నిర్మించిన టెక్నికలర్ చిత్రం "ఆన్" ముందుగా ఇండియాలో రిలీజ్ చేయకుండా 'లండన్'లో రిలీజు చేయుటకు కారణము తెలుపుతారా?

—ముందు లండన్‌లో విడుదల చెయ్యాలని ఆయన అనుకోలేదట. కాపీలు ప్రింటు చేయించటానికి లండను వెళ్లేటప్పటికి ఆ చిత్రం చూసిన కొందరు లండన్‌లో విడుదల చేయవలసిందిగా బలవంతం చేశారట.

* * *

బొడ్డు సుబ్బారావు—విశాఖపట్నం.

ఏమండీ సెప్టెంబరు 28 కి వచ్చే (పిల్లల) ఆంధ్రపత్రికలో పిల్లల ప్రశ్నలకు కూడా జవాబులిస్తారా?

—'పిల్లప్రశ్నలు' కాకుండా పిల్లలు వేసే ప్రశ్నలైతే సమాధానాలు యిస్తాం.

* * *

ఇ గోవిందరెడ్డి—ఘన్‌పుగా.

ఫిలిం ఎక్స్‌పోజింగ్ మరియు రికార్డింగ్ ఒకే సమయమున జరిపెదరా?

—అవును. పాటలను, నేపథ్య సంగీతాన్ని మాత్రం వేరుగా రికార్డుచేస్తారు.

* * *

తుర్లూరి రామమోహనరావు—తాడంకి.

ఆధునిక కాలంలో ప్రజాసేవ పేరిట రోజుకొక పార్టీమార్చే మహాపురుషుల విషయంలో మీ అభిప్రాయం సెలవిస్తారా?

—రాజకీయపార్టీల సిద్ధాంతాలపట్ల వారి విశ్వాసబలానికి కది నిదర్శనం.

ఏదైనా ఒక దేశం పురోగమించాలంటే నాయకుని ఆదేశానుసారం ప్రజలు నడవటంమంచిదా? ప్రజల అభీష్టప్రకారం నాయకుడు నడుస్తే మంచిదా?

—సందర్భశుద్ధి, మితిఅనేవి ఉభయత్రా అవసరమే. గుడ్డిగా ఎవరు ఎవరిని అనుసరించినా ముప్పేనని చరిత్ర చెప్తోంది.

* * *

వై. సూర్యప్రకాశరావు—కాకినాడ

సినిమటోగ్రఫీ గురించి బోధించే ఎకాడమీ యేదైనా మద్రాసులో వుందాండి? ఉంటే యడ్రసు తెలుపుతారా?

—గవర్నమెంట్ సెంట్రల్ పాలిటెక్నిక్, బ్రాడ్వే, మద్రాసు-1

* * *

పాలెపు ఈశ్వరరావు—చీరాల.

రంగుచిత్రాలు అనబడే వాటిలో అనేక రకాలు ఉన్నవి కారణ మేమిటి? టెక్నికలర్, సినీకలర్, ట్రూకలర్, గేవాకలర్, అని వివిధ పేర్లతోనున్న వీటిల్లో వీటికిగల తేడాలు యేమిటి? మనదేశ నిర్మాతలైన మెహబూబ్, మోడీ గార్లు నిర్మించిన, నిర్మించబోవు చిత్రాలు పై రంగులలో దేనిలో తీస్తున్నారు?

—ఇవన్నీ వేరువేరు కలర్ కంపెనీలు కృతిమ ప్రోసెసింగ్ విధానాలకు పెట్టుకున్న పేర్లు. వీటిల్లో వీటికి కొద్ది తేడా లుంటాయి. మెహబూబ్ తన చిత్రాన్ని 16 మిల్లిమీటర్ల కోడక్రోమ్‌తో తీసి టెక్నికలర్ విధానంలో ప్రింట్ చేయించాడు. సాహ్రాబ్ మోడీ తన చిత్రాన్ని మొదటి నుండి తుదివరకూ టెక్నికలర్ ఫొటోగ్రఫీలోనే తీశాడు.

కొద్దిరోజుల్లో ప్రధాని నెహ్రూ తన ప్రభుత్వంద్వారా దేశంలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకొని రాగలడనియు, సోషలిజం పునాదిపై ప్రభుత్వవ్యవస్థ యేర్పాటు చేయగలడని వదంతిగా నున్నది నిజమేనా?

—ఇదేదో గిట్టనివాళ్లు కల్పించిన వదంతియై ఉండాలి.

* * *

కె. వి. యస్. మూర్తిరెడ్డి—గణపవరం

అసెంబ్లీలో ప్రతికూలపక్ష సభ్యులు వేసిన ప్రశ్నలకు, ఆయాశాఖల మంత్రులు సమాధానము చెప్పకుండా అన్నిటికి రాజాజీయే సమాధానములు చెప్పి వాటితోనే సరిపుచ్చుకోమనడంలో రాజాజీ అంతర్యం ఏమిటై యుంటుందంటారు.

—ఇతర మంత్రుల సమాధానాలతో సరిపెట్టుకోమనడం ఇష్టంలేక కావచ్చు.

* * *

కె. ఎల్. నరసింహాశర్మ—కొర్నిపాడు.

"డిటర్మినిజం" అంటే ఏమిటి?

—భౌతిక, మానసిక పరిస్థితులే ప్రపంచంలో జరిగే ప్రతిసంఘటననూ, మానవుడు చేసే ప్రతిపనినీ నిర్ణయిస్తాయనే సిద్ధాంతం.

* * *

కంభంపాటి సత్యనారాయణ—విజయనగరము.

స్వేచ్ఛ (*Liberty*), సమానత్వం (*Equality*) ఈ రెండూ ఒక్కచోట ఉండలేవండీ. అమెరికాలో మొదటిది ఉంటే, రష్యాలో రెండోదుందని నా నమ్మకం. ఇంక ఇండియాలో ప్రివెంటివ్ డిటెన్షన్ ఏక్టు నిర్ణయించాలంటా. మీరేమంటారు?

—అంటే ప్రివెంటివ్ డిటెన్షన్ ఏక్టువల్ల మనదేశంలో సమానత్వం స్థాపించవచ్చని మీరు భావిస్తున్నారన్నమాట!

ప్రకాశంగారు కమ్యూనిస్టులతో పొత్తుగాఉన్నా, కమ్యూనిస్టు పార్టీ అంటే శ్రీ నాగిరెడ్డి, కాంగ్రెసు పార్టీ అంటే శ్రీ సంజీవరెడ్డి, మద్రాసుకి తిలోదకాలు ఇచ్చేస్తారు కాబట్టి, ఇంక ఆంధ్రరాష్ట్రం ఇవ్వడానికి శ్రీ నెహ్రూకు అభ్యంతర మేముంది?

—ప్రకాశంగారిమాట తోసివెయ్యడం నెహ్రూగారి కిష్టం లేకనేమో!

* * *

బి. విరూపాక్షులు—కోసిగి.

లోకము మోసగింపబడుతుంది అయినప్పటికీ మోసగించేవాళ్ళనే గౌరవిసుంది కారణం? నిజాయితీగ బతికేవారిని ప్రాణాలు కోల్పోయినను గౌరవించక హీనంగా చూస్తుంది. కారణం?

—మోసంలోనే కాదు, ఏ అంశంలో నైనాసరే ప్రజను లోకం గౌరవిస్తుంది. నిజాయితీ అనేది మనోబలంతో కూడు కున్నదైతే లోకం గౌరవిస్తుంది; అదే దౌర్బల్య ఫలితమైతే మన్నించదు.

* * *

వల్లభనేని సీతారామయ్య—మామిడికోళ్ల.

దేశస్వాతంత్ర్య సముపార్జనకు పూజ్య బాపూజీ సత్యాగ్రహము నొక పవిత్రసాధనముగా ప్రబోధించియున్న సంగతి జగద్విదితము. అట్టితరి ఆంధ్రరాష్ట్రసముపార్జనకుగాను స్వామీ సీతారాం తలపెట్టిన సత్యాగ్రహము, లక్ష్యసిద్ధికి యెంతమాత్రము వాంఛనీయము కాదని కాంగ్రెసువాదులు, నాయకులు బహిరంగముగా ప్రకటనలు చేయుట సమంజసమో కాదో సమాధానమిప్పించ ప్రార్థించుచున్నాను.

—ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి కాంగ్రెస్ ప్రభుత్వమూ కాంగ్రెస్ వాదులూ సుముఖులైనప్పటికీ, ఆంధ్రదేశ నాయకుల మధ్యనూ, ఆంధ్ర తమిళనాయకుల మధ్యనూ కొన్ని ముఖ్య విషయాలలో ఏకాభిప్రాయం, లేదా కనీసంపరిష్కార మార్గాలోచనకు సుముఖత, లేనందువల్ల వెంటనే రాష్ట్రనిర్మాణాని కుపక్రమించలేకపోతున్నట్లు నెహ్రూ చెప్పారు. ఈ పరిస్థితిలో రాష్ట్రనిర్మాణానికిగల ప్రతిబంధకాలను తొలగించడానికి ఉపవాసమూ సత్యాగ్రహమూ సాధనాలు కాజాలవని కాంగ్రెస్ వారి అభిప్రాయం. స్వామి సీతారాంగారి ఉపవాస దీక్ష, సత్యాగ్రహాలవల్ల (నెహ్రూగారి మాట అటుంచి) ఆంధ్ర తమిళదేశ నాయకుల హృదయాలలో ఎట్టి పరివర్తన కలిగిందో, నిర్మాణాత్మకమైన కృషికి ఎంతవరకూ దోహదం కలిగిందో చెప్పలేము.

* * *

కె. సి. పి. వర్మ.

మహమ్మదీయులు ఇండియానుండి పాకిస్తాను వేరు చేసుకొనటమువలన ఇండియాలోవున్న మహమ్మదీయులకు ఏమాత్రము మర్యాద లేకపోయింది. ఈ విధముగనే మనము ఆంధ్రరాష్ట్రమును వేరుచేసుకొన్నచో ఆంధ్రులకు మర్యాద దక్కదని నావూహ?

—పాకిస్తాన్‌స్థాపనకీ ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికీ పోలిక లేదు.

* * *

జి. రామచంద్రమూర్తి—ఆరుగొలను.

నేటి విద్యార్థులు రేపటి పౌరులంటారు! నేటి విద్యార్థులు రేపటి పౌరులవుతే స్వార్థమును విడచి దేశసేవ చేస్తారంటారా?

## గమనిక

"పాఠకులవద్దనుంచి విజ్ఞానమునకు సంబంధించిన ప్రశ్నలు వస్తుంచున్నవి. వాటి సమాధానాలు పెద్దవైతే "విజ్ఞానవీధులు" లోనూ, చిన్నవైతే "ప్రశ్నలూ - సమాధానాలు" లోనూ చూసుకోమని మనవి.

—సంపాదకుడు.

—నేటి పౌరులైనా, రేపటి పౌరులైనా అలాటి గారంటీ ఎప్పుడూ లేదు.

* * *

పాఠశాలలలో ఇంగ్లీషు మాట్లాడితే కర్త, కర్మ, క్రియ సరిగా ఉండాలంటారు. ఉద్యోగస్థులు అంత గబగబ మాట్లాడతారు; వారు మాటలాడే మాటల్లో కర్త, కర్మ, క్రియలు లోపించకుండా ఉంటాయంటారా?

—ఉద్యోగస్థులికి మార్కుల బాధ లేదుగా!

* * *

కె. యస్. ఆర్. మూర్తి—విజయవాడ.

బస్సుల్లోకాని, బండ్లలోకాని ఎక్కువ మందిని ఎక్కించరాదని ఒక శాసనము వుంది. అట్లే రైళ్లకు గూడా ఎక్కువ టిక్కెట్లు యివ్వకూడదని ఒక శాసనము పెడితే బాగుంటుంది అని మా నమ్మకము. దీనికి మీ సమాధాన మేమిటి?

—ప్రమాదావకాశాల్ని బట్టి శాసనాలు ఆ రీతిగా ఉన్నాయి. ఆమాట అటుంచి, రాబడి తగ్గే ఏ సూచనకీ ప్రభుత్వం ఆమోదించే స్థితిలో లేదు.

* * *

పి. జములయ్య—మైలవరం.

మద్రాసు అసెంబ్లీలో మంత్రివర్గమునకు ప్రతిపక్షంగా వుంటూన్న 'యునైటెడ్ డెమొక్రటిక్ ఫ్రంట్' నుండ క్రమేపీ కమ్యూనిస్టేతరులు (ప్రజాపార్టీవారు) విడిపోవుటకు, కమ్యూనిస్టులు విడక పోవుటకుగల కారణము లేమిటో విశద పరుస్తారా?

—కమ్యూనిస్టులకున్న కట్టు, పట్టుదల, లక్ష్యబలమూ ఇతరులకు లేవన్నమాట.

* * *

వై. కె. రావు—బళ్ళారి.

క్రీస్తుమతమునకు బైబులు, మహమ్మదీయ మతమునకు ఖురాను ఆధారములు. అవిధముగ హిందూమతమునకు ఆధారమైన గ్రంధమేది?

—హిందూమతానికి ప్రవక్త అంటూ ఎవరూ లేరు. అందుకే హిందూమతం ఇదమిత్థమని నిర్వచించే గ్రంథంలేదు. ఈశ్వరవాదంనుంచి నిరీశ్వరవాదంవరకూ, క్షుద్రదేవతారాధననుంచి అద్వైతంవరకూ అంతా హిందూమతమే. భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు హిందువులకు ప్రధాన గ్రంథాలు

* * *

## నువ్వులు

(6-వ పేజీ తరువాయి)

కొత్తపన్నులు వేయుటకు వీలులేదు. ఎందుకంటే ఇప్పటికే పన్నులభారం ప్రజలకు తలమునకలుగా ఉంది. ద్రవ్య చలామణి వృద్ధిచేయడానికి ఇంకా ఎక్కువ కరెన్సీ నోట్లు అచ్చువేసే అవకాశం లేదు. అందుకు కావలసిన కాకితాలు కూడా సమృద్ధిగా లేవన్నారు (నవ్వుతూ)-విదేశాలనుంచి ద్రవ్య సహాయం కావాలంటే మన దేశాన్ని దేశస్వాతంత్ర్యాన్ని కుదువబెట్టి తెచ్చుకోవలసివస్తుంది. కనుక తైలం లేని దీపం యీ ప్రణాళిక అన్నారు. ఇంకా ఇంతకంటె దానినిగూర్చి వ్యాఖ్యచేయవలసిన అవసరం లేదు వ్యాఖ్యానం వ్రాయడానికి కూడా దీపంలో తైలం అయిపోయిందనే కారణంచేత ఒక పండితుడు వ్యాఖ్యానం సమాప్తం చేశాడు. "యావత్తైలం తావద్వ్యాఖ్యా" అన్నాడు. ఎంత తైలం ఉంటే అంతే వ్యాఖ్య అన్నాడు. మాటలు లేని మాట లెందుకు? ఇంతటితో యీ పంచవర్ష ప్రణాళికా పంచాంగం కట్టిపెట్టవచ్చునని మాత్రం భావించడం భావ్యంకాదు.

"స్వాతంత్ర్యంవచ్చి అయిదేళ్ళయింది. ఒక పంచవర్షపంచాంగం పూర్తిఅయింది. కొత్త పంచవర్షపంచాంగం తయారైంది. స్వాతంత్ర్యదినం రోజున ఈకొత్త పంచవర్ష పంచాంగశ్రవణం చేయడం ఒకవిధంగా మంచిదే. ఎందుకంటే అనేక దుస్స్వప్న దుర్భ్రమదోషం తొలగిపోతుంది "శ్రీ కల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం" గనుక "పంచాంగమాకర్ణ్యతాం" అన్నారు. పంచాంగశ్రవణం చేయవలసినదే. కాని మన తిలలను పీడించి మన చమురుతీసే తిలఘాతకులను భీకర మూర్తియైన కాళికేశ్వరికూడా ఏమీ చేయలేకుండా ఉంది. మన తిలలు తిని పోయే బిలబిలాక్షులు ఏవో తెలిసికోవాలి.



# ఆహుతి

(17-వ పేజీ తరువాయి)

జీవితాన్ని గురించి అన్నయ్య కలలు కన్నాడు. కలలన్నీ కల్లలయాయి. మా కోసం అన్నయ్య అన్ని కష్టాలను జీవం లేని చిరునవ్వుతో ఎదుర్కొంటున్నాడు.

అన్నయ్య మధ్య మధ్య దగ్గటం మొదలు పెట్టాడు. "అన్నయ్యా! నీకు దగ్గు వస్తోంది డాక్టరుకు చూపించు" అన్నా. "ఇంత మంది రోగుల్ని డాక్టరుకు చూపించేందుకు మనం ఏమంత ఆర్థికస్తోమతు గలవాళ్లమని? ఏం లేదు. జలుబు చేసి రొంప, దగ్గు వచ్చిందిలే. అదే పోతుంది. నువ్వేమీ బెంగపెట్టుకోకు" అన్నాడు.

అన్నయ్య సన్నగా చిక్కిపోయాడు. అన్నయ్యకళ్ళలో జీవం లేదు. ఎండిపోయిన గుండెలు, లోతుకుపోయిన కళ్లు, అన్నయ్యను చూస్తుంటే భయమేసేటున్నాడు. ఎప్పుడూ నన్ను కేకలేసేవాడు కాదు. నేనంటే అన్నయ్యకు అమితమైన ప్రేమ. ఈ దగ్గు వచ్చినదగ్గరనుంచి నన్ను కూడా విసుక్కోవడం మొదలెట్టాడు. అన్నయ్యకు అనవసరంగా బాధ కలిగించడమెందుకని దూరంగానే ఉంటూ వచ్చాను. నేను దూరంగా ఉంటున్న కొద్దీ అన్నయ్యకు లోలోపల బాధపడేవాడు.

నాన్న జబ్బు మరీ ఎక్కువైంది. డాక్టరు అప్పుడే నాలుగైదుసార్లు వచ్చి వెళ్ళాడు. దగ్గు ఆయాసంతోటి నాన్న గిలగిల కొట్టుకుంటున్నాడు. నాన్న బాధ చూడలేక పిల్లలిద్దరూ గొల్లుమన్నారు. నాకు కళ్లలో నీళ్ళు తిరిగాయి. అన్నయ్య మాత్రం అలాగే శిలాప్రతిమలా నుంచొని చూస్తున్నాడు.

నాన్న దగ్గుతెర కొంచెం తగ్గింది. మమ్మల్ని దగ్గరకు రమ్మని సైగచేశాడు. యిద్దరం దగ్గరకు వెళ్లాం. పిల్లలు నాన్న తలప్రక్క కూర్చొన్నారు. నాన్న బతికే సూచనలు కనబడలేదు. మా కళ్ళలోకి చూస్తూ "మిమ్మల్ని దిక్కులేని వాళ్ళనిచేసి వెళ్లిపోతున్నా. మీ నాన్న జమీందారు కాదుమిమ్మల్ని సుఖపెట్టేందుకు. బతుకు కోసం బతికిన ఒక గుమాస్తా మీ నాన్న. యీ పసికూనల్ని మాత్రం కొస్త పెంచి పెద్ద వాళ్ళని చెయ్యండి. మీరే...వీ...ళ్ల...కి" అంటూ ఏమిటో చెప్పబోయాడు. మిగిలిన మాటలు నోట్లోనే గొణగొణమన్నాయి. పైకి రాలేదు. దగ్గుతెర వచ్చింది. ఈ దగ్గు ఆగడం నాన్న చూపు నిలిచిపోవడం రెండూ ఒక్కసారిగానే జరిగాయి. యిల్లంతా ఒక్కసారి గొల్లుమంది.

అన్నయ్య మాత్రం ఏమీ చలించలేదు. అలానే చూస్తూ ఉండిపోయాడు. మమ్మల్ని ఓదార్చేందుకు కూడా ప్రయత్నించలేదు. అన్నయ్యకు మతిచలించిందేమోనని భయపడ్డాను.

"త్వరలోనే చచ్చాడు నాన్న. బ్రతికిపోయా" అన్నాడు అన్నయ్య. నాకు కోపం వచ్చింది. "యివేం మాటలన్నాయ్! ఎవరైనా వింటే ఏమనుకొంటారు?" అన్నాను.

"నాన్న జబ్బుతో బ్రతికున్నంత కాలం మనం ఏం సుఖపడ్డాం? ఆయన కెట్లా ఉందోనని ఎంత బాధపడ్డాం? ఆయన పెన్షన్ కాక మన సంపాదనలోది కూడా పెట్టినా ఆయన మందులకోసం సరిపోలేదు" అన్నాడు. దారిద్ర్యం ఎంతెంత మాటలైనా అనిపిస్తుంది. బంధుత్వాలూ, ప్రేమలు, అనురాగాలూ నాశనమవుతాయి. అన్నయ్య నాన్న శవాన్ని కిరాయి వాహకుల సహాయంతో తీసుకెళ్ళి, ఆయన పెన్షన్ డబ్బులలో మిగిలిన డబ్బులతో కొన్న పుల్లలతో దహనంచేశాడు. దహనం అయినతర్వాత ఆ చితి దగ్గరనే శూన్యపు దృక్కులతో ఒక అరగంట కూర్చొని యింటికి వచ్చాడు.

ఇప్పుడు మాకు అమ్మానాన్నా అన్నయ్యే అయ్యాడు. "మిమ్మల్ని నేను ఆకలితో చావనీను. నాకంఠంలో ప్రాణం ఉన్నంత వరకు పనిచేసి పోషిస్తా. నాలాగా వెంకును గుమాస్తాగా తయారుచేయను. వెంకును పెద్దచదువు చదివిస్తా. చిట్టిని డాక్టరు చేస్తా. వాళ్లకి పేదరికం అంటే ఏమిటో తెలియజేయనీను. వాళ్ళకు కష్టాలు అంటనీయను. వాళ్ల సుఖంకోసం అవసరమైతే యిరవైనాల్గు గంటలూ పనిచేస్తా" అన్నాడు అన్నయ్య.

నాన్నపోయి నెల్లాళ్ళయింది. రోజూ రాత్రిళ్లు ఒంటిగంటకు యింటికి వస్తున్నాడు అన్నయ్య. రాత్రిళ్లు తాను ఏ పని చేస్తున్నదీ మా కెవళ్లకీ చెప్పటంలేదు.

ఒకరోజు రాత్రి అన్నయ్య యింటికి తూలిపోతూ వచ్చాడు. వెంటనే పట్టుకొన్నా. అన్నయ్యను పట్టుకుని లోపలకు తీసుకువెళ్లాను. అన్నయ్య తల నా ఒళ్ళో పెట్టుకొని ముఖంతడిగుడ్డతో తుడుస్తున్నా. కొంచెం సేపటికి తేరుకొని నాముఖంలోకి చూశాడు. ఏదో విషయాన్ని దాచాలని ప్రయత్నం చేస్తున్నట్టుగా కనపడింది అన్నయ్యముఖం. ఆ గుడ్డి వెలుగులో అన్నయ్య చేతిలో ఉన్న ఎర్రగుడ్డ తీసుకొన్నా. తడిగాకూడా ఉంది. ఆ గుడ్డ నాకు కనపడకుండా ఉంచాలని ప్రయత్నంచేశాడు. అది ఎర్రగుడ్డకాదు. రక్తం అంటిన జేబురుమాలు. నా గుండె లాగిపోయినంత పనైంది. లైటు తీసుకొని వచ్చి అన్నయ్యముఖంలోకి చూశా. నోటినుంచి బుగ్గలమీదుగా ఎర్రని రక్తపు మరక కనపడింది. భయంతో శరీరం కంపించింది. కెవ్వుమని కేక నానోటినుండి అప్రయత్నంగా రాబోయింది. నిద్ర తున్న పిల్లలు భయపడపోతారని నా



భయాన్ని నాలోనే దిగమింగుకొన్నా. అర్థంలేని చూపులతో అన్నయ్య నాకేసి చూశాడు.

అన్నయ్య ఎముకల్లా ఉన్న వేళ్ళతో నా ముంగురులను సరిచేస్తూ నా ముఖాన్ని తన చేతులలోకి తీసుకొన్నాడు. "చెల్లీ! నేను కూడా మిమ్మల్ని సుఖపెట్టలేకపోయాను. ఇంతకాలంనుంచి ఏ విషయం మీకు తెలియకుండా దాచాలనుకొన్నానో ఆ విషయం తెలియజేయవలసి వచ్చినందుకు విచారిస్తున్నా. నా శరీరంలో ఉన్న శక్తినంతనీ యాజమానుల లాభాలకి, ప్రభుత్వ యంత్రం నడిచేందుకు ధారపోశా. కనీసం మీ భవిష్యత్తైనా బాగుపడాలనే ఉద్దేశంతో అన్ని శ్రమలకు ఓర్చా. అయినా లాభం లేకపోయింది. నాన్న నాకు కాలేజీలో ఉండగా పంపించే డబ్బు నాకు సరిపడేదికాదు. అందుకోసం రాత్రులు సినిమాహాల్లో ఎకౌంట్లు చూస్తూ సంపాదించిన డబ్బుతో నా చదువు సాగించా. ఆ అనుభవం మూలంగానే యిక్కడ సినిమాలో ట్రాన్సులేటరుగా పనిచేసి నెలకు ఏభైరూపాయలు సంపాదిస్తూ వచ్చా. ఈ మూడేళ్ళు రాత్రులు సరియైన విశ్రాంతి లేకపోవడం మూలంగా ఆరోగ్యం దెబ్బతింది. దగ్గు పట్టుకొని సుమారు ఆరునెలలయింది. నా బాధను మీకు తెలియపరచి మిమ్మల్ని బాధపెట్టాలనుకోలేదు. కాని ఈ దగ్గు తీవ్రరూపం ధరించి నన్ను అశక్తుణ్ణిని చేస్తుందని ఏనాడూ అనుకోలేదు. నేను చేస్తున్న టెంపరరీ ఉద్యోగానికి నాలుగురోజులక్రితమే స్వస్తివచనం చెప్పి నా స్థానంలో పెర్మనెంటు గుమాస్తానివేశారు. అయినా ఏదో పని ఉండి పోయిందని ఈ నాలుగు రోజులు ఆఫీసుకు వెళ్లాలసి వచ్చింది. రెండురోజుల నుండి దగ్గు ఎక్కువై రక్తంకూడా రావడం మొదలుపెట్టింది. మీ సున్నిత హృదయాలని బాధపెట్టడం యిష్టంలేక దూరంగా ఉంటూ వచ్చా. కాని నా నరాలు నా స్వాధీనం తప్పబట్టి మీకు తెలియజేయవలసివచ్చింది. బ్రతుకుతానని నాకు ఆశలేదు. క్షయ వచ్చిన వ్యక్తుల్లో బ్రతికినవాళ్ళు చాలా తక్కువ. ఇటువంటివి మనకు రావలసినవి కావు. ఎవళ్లో డబ్బున్నవాళ్ళకి రావలసినవి. ఈ జబ్బుతో నేను యీవేళ కాకపోతే రేపైనా అంతరించవలసిన వాడినే. నువ్వే నీ తమ్ముడిని చెల్లెలిని పోషించవలసిన బాధ్యత తీసుకోవలసిఉంటుంది. నాన్న వంశమర్యాద అంటూ తన జీవితాన్ని ఆహుతి చేశాడు. నువ్వుమాత్రం పిల్లల భవిష్యత్తుకోసం నీ జీవిత ఆనందాన్ని త్యాగం చేయి" అని అంటూ ఉండగానే అన్నయ్యకు దగ్గు, దగ్గుతోపాటు ఎక్కువ రక్తం వచ్చాయి. అన్నయ్య బాధనంతనీ తనలోనే అణుచుకొంటున్నాడు. "చెల్లీ, రోజులదాకా లేదు నా బ్రతుకు; నిమిషాలు గడవటంకూడా కష్టం. ఏదీ, జీవితంలో ఆనందాన్ని ఎరగని నీ ముఖాన్ని నాకు ఆఖరిసారిగా చూపించు" అని నన్ను దగ్గరగా తీసుకొన్నాను. దుఃఖాన్ని దిగమింగలేకపోయాను. నా కళ్ళనుండి వెలువడిన కన్నీళ్ళు అన్నయ్య చెక్కిలిమీద పడుతున్నాయి. "అన్నయ్యా" అని ఒక్కసారిగా కౌగలించుకొన్నా. "పిచ్చిపిల్లా! ఏడవ్వచ్చా? ఈ సమాజంలో మానవుడై పుట్టినందుకు సుఖించడానికి అర్హతలేదు. జీవితంలో కష్టాలను ధైర్యంతో ఎదుర్కోవాలి. వాటి పునాదులను మొదలంటా నాశనం చేసేందుకు అవసరమైతే ఆనందాన్ని, జీవితాన్ని ఆహుతి చేయవలసిఉంటుంది. మనం కాకపోతే మన ముందు తరాలవాళ్ళైనా సుఖపడాలని ఆశిద్దాం" అంటూ నా కన్నీళ్లని తన బలహీనమైన చేతులతో తుడిచాడు. "చెల్లాయ్! ఏదీ ఒక్కసారి నవ్వు. నీ చిరునవ్వు చూస్తూ నా ప్రాణాలు ఒదులుతా" అంటూ ఉండగానే విపరీతమైన దగ్గు, దగ్గులో రక్తం ప్రవహించడం మొదలెట్టాయి. రక్తపు మడుగు మధ్య అన్నయ్య గిలగిలాకొట్టుకొంటున్నాడు. అయిదు నిమిషాలు అన్నయ్య నరకబాధ అనుభవించి మెడ వాల్చేశాడు. "అన్నయ్యా" అంటూ అన్నయ్య గుండెలమీద పడి ఏడ్చా.

నా ఏడ్పుకి పిల్లలిద్దరూ "అక్కయ్యా! భయమేస్తోందే" అంటూ నిద్రకళ్ళని కళ్లు నులుపుకుంటూ వచ్చారు. అన్నయ్యని చూసేసరికి "అన్నాయ్! ఈవేళ మాకి బొమ్మలు తీసుకొస్తానన్నావు తీసుకొచ్చావా" అంటూ అన్నయ్య దగ్గరకు వచ్చారు. నా ఏడుపు చూసి, రక్తంలో ఉన్న అన్నయ్యని చూసి పిల్లలు భయపడి గొల్లుమన్నారు. అన్నయ్య ఆఖరున చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. అన్నయ్య ముఖంలో గంభీరత ఉంది. సమాజ పరిస్థితులపై అన్నయ్యకు గల క్రోధం అన్నయ్య ముఖంలో ప్రస్ఫుటంగా గోచరించింది. అన్నయ్య మాటలు నాకొక దివ్యసందేశాన్నిచ్చాయి. ప్రపంచం అంతా శూన్యంగా కనబడింది. పిల్లల్నిద్దర్ని చేరి ఒకప్రక్కా తీసుకొని ఓదార్చేందుకు ప్రయత్నిస్తున్నా. దుఃఖంలో నోట మాట రావటం లేదు. ఇద్దర్నీ కౌగిలించుకొని నాలో నేను ఏడ్చా. ఆ చీకటిలో శూన్యంగా ఉన్న బయటకు చూశా. దూరంగా మినుకుమినుకుమంటున్న దీపం, మధ్య మధ్య అరుస్తున్న గుడ్లగూబల అరుపులుతప్ప నామీకే తెలియలేదు 



Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras



పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



ంతకాలమగు సరికా
ాకములో హంసకు బహు
ఢముగా మైత్రి పెరిగె
ఒకరినొకరు విడువనొల్ల
కెప్పుడు జత గూడువారు
ఒకరోజున గుడ్లగూబ -































